ఈ సంచిక ఆదిలాబాదు, కరీంనగర్ జిల్లాల రైతాంగ పోరాటాలకు అంకితం.

85

# సృజన

నవంబర్ 1978

ఆధునిక సాహిత్య వేదిక
మాస పత్రిక

ఆదిలాబాదు, కరీంనగర్ జిల్లాల పల్లె ప్రజల బతుకునీ, బాసనీ, కన్నీళ్ళనూ, పోరాటాలను చిత్రించిన జరుగుతున్న జనం కథ **అల్లం రాజయ్య** నవల

## కొలిమంటుకున్నది

ఈ సంచికతో ప్రారంభం

## పుడమి తల్లి పురిటినొప్పుల చప్పుడు
## ఆదిలాబాదు కరీంనగర్ జిల్లా పోరాట పాటలు

---

**సిరిసిల్ల, జగిత్యాల తాలూకాలను 'కల్లోలిత ప్రాంతాలు' గా ప్రకటించడాన్ని ప్రజాస్వామ్య శక్తులంతా ప్రతిఘటించండి.**

---

నిర్వహణ :
'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా 15 రూపాయలు  ఈ సంచిక రు. 1-50 పైసలు

ఈ సంచికలో....




SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Warangal Printing Press, J.P.N. Road, Warangal - 506 002
for Venkataramana Mudranalayam, Warangal

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాస పత్రిక

85

నవంబర్ 1978

## బోల్షివిక్ విప్లవానికి అభినందనలు

ప్రపంచంలో కార్మికవర్గ పార్టీ నాయకత్వంలో తొలి సామ్యవాద ప్రభుత్వ స్థాపనకు కారణమైన బోల్షివిక్ విప్లవం జారిస్టు రష్యాలో 1917 అక్టోబరులో విజయవంతమైంది. సవరించబడిన కాలెండర్ ప్రకారం ఈ 'అక్టోబరు విప్లవం' నవంబరు 7న ప్రపంచ వ్యాప్తంగా సామ్యవాద భావాలుగల ప్రజలు జరుపుకొంటున్నారు. రష్యన్ బోల్షివిక్ విప్లవానికి, ఆ విప్లవానికి నాయకత్వం వహించిన బోల్షివిక్ పార్టీకి ఆపార్టీ నిర్మాత లెనిన్‌కూ ఇవే మా అభినందనలు.

నిర్వహణ :

'సాహితీ మిత్రులు'

ంవత్సర చందా 15 రూపాయలు — ఈ సంచిక రు. 1-50 పైసలు

# కొత్త సూర్యుడు

కె. వి. రమణారెడ్డి

జగిత్యాలమీన సిరిసిల్లమీన వేములవాడమీన
        నిజంగానే వెలుగుతున్నావట్రా సూర్యుడా నువ్వు?
చీకటికి నేల అప్పగించి పట్టపగటినికూడా నడిరేత్రిగా మార్చి
        దొరలతో దోస్తుకడుతున్నావు గదరా ధూర్తుడా నువ్వు!
చిన్మెట్‌పల్లిలో గడీపై కిటికీలోంచి ఒక పిరికిపంద ఆసామి
        బారుతుపాకినుంచి మిత్తిన తూటాలు వదలడం చూశ్లేదూ?
చూస్తూ వూరుకోవటమేగాక, నీకిరణాల వేడి మంటలతోటి
        బక్కరైతాంగం పెయ్యిలు పగుళ్ళబారే రణపుళ్లు చెయ్యలా?
'కర్మసాక్షి'వట్రా నువ్వు, కలవాళ్ళ భట్రాజూ! పోలీసు తోడేళ్ళతో
        కలగలిసి కండలుపెరిగి రగతం రుచిచూస్తున్నావు
ఛీ! నీముఖం చూపకు!

కలలు గంటున్నాయి పంటలకోసం పోరంబోకు పొలాలుసైతం
        బంజరాయి నేలలు నాగలికర్రను చేరబిలుస్తున్నాయి
ఎర్రజండాలు నడుస్తున్నాయి వందలాదిగా అరకల బుజాలమీదెక్కి
        'జీనాహైతో మర్నాసీఖో' అనుకుంటున్నారు జీవచ్ఛవాల్లాంటోళ్ళు
నొప్పులు పడుతూంది భూమి, నెత్తురుగుడ్డౌతూంది వర్తమానకాలం
        ప్రభుత్వానికీ పశుత్వానికీ సలాంగొడుతున్నావట్రా
ఘోరరగులామా నువ్వు!

కుళ్ళి గబ్బుగొడుతున్నావు చచ్చుబడ్డావు చావకున్నావు
        పక్షపాతం పక్షవాతమై నీకు నోరుపడిపోయింది
మావోడు మరోసూరీడు పేరేవున్నాడు పొడుస్తున్నాడు
        అబద్ధాలనూ అకృత్యాలనూ చీల్చి చెండాడుతున్నాడు
జనం ప్రాణమౌతున్నాడు గుండెధైర్య మౌతున్నాడు పోరాడుతున్నాడు
                నీ చావు వాడిపుట్టుక
                నీ ఓటమి వాడిగెలుపు పతాక!

## 'కల్లోలిత ప్రాంతాలు'

కరీంనగర్ జిల్లా సిరిసిల్ల, జగిత్యాల తాలూకాలను కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించింది ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం.

'ఈ రెండు తాలూకాలలోనూ తీవ్రవాదుల కార్యక్రమాలు పెచ్చుపెరిగిపోతున్న దృష్ట్యా ఈ చర్య తీసుకున్నట్టు అధికార వర్గాలవారు తెలియజేశారు.'

'ఈ తాలూకాలలో యిటీవల తీవ్రవాదులు కొందరిని హత్యచేయడం'– ఒక్క ఉదంతం చూపించగలదా ప్రభుత్వం– అయితే యిది యింకొకవేపు నుంచి చూడాలి. సిరిసిల్లలో దొర రహస్య జీవితానికి వెళ్ళిపోయిన కార్యకర్త భార్యను యింటికి పిలిపించాడు. ఏం జరిగిందో తెల్లవారి ఆమె శవం బావిలో తేలింది. జగిత్యాల తాలూకా లొత్తునూరులో పోలీసులు పోచయ్యను కాల్చి చంపారు. కనీసం ఈ రెండు హత్యలు నిన్నమొన్నటివి. ఒకదానికి కారకుడు భూస్వామి– మరొకదానికి భూస్వామికి మద్దతుగా వచ్చిన పోలీసులు. తీవ్రవాదులు కాదు, అక్షరాలా 'కత్తులు, తుపాకులు చూపి భయపెట్టి ప్రజల నుండి డబ్బు వసూలు' చేసింది భూస్వాములు. తుపాకులు పేల్చి ప్రజల్ని తీవ్రంగా గాయపర్చింది భూస్వాములు. అయితే ప్రజలు బెదరకుండా ప్రతిఘటించిన మాట నిజం. తమ యిళ్ళు, బతుకులు దోచుకున్న దొరలను సాంఘికంగా వెలివేసి కోరలు పీకిన మాట నిజం. 'రెక్క బొక్క నొయ్యకుండ, సుక్క సెమ్మ వొడ్వకుండ బొర్రబాగ బెంచినవ్ర దొరోడో, నీ పెయ్యంతా మంత్రిస్తం దొరోతో' అని యిదివరకు దొర 'కాల్లడుపులు మొక్కినోల్లె' తమ పానానికి ముప్పయిన దొరల మస్తి 'వొదులగొడ్తం' 'సస్తెమూనాయె గాని' అని తెగించిన మాట నిజం. 'భూములను బలవంతంగా ఆక్రమించు కొనడం' నిజం. కాని ఎవరి భూములు? దొరల దురాక్రమణలో వున్న ప్రభుత్వం భూములు, బంజర్లు, అడవి భూములు. ఏ భూములైతే ప్రజలకు చెందాలని, హరిజన గిరిజన బలహీన వర్గాలకు చెందాలని ప్రభుత్వం బడాయిలు చెప్పిందో ఆ భూములను, అంటే తమ భూములను తాము, ప్రజలు ఆక్రమించుకున్నారు. ప్రజల భూములను ప్రజలు ఆక్రమించుకోవాలని, 'దున్నేవానికి భూమి' దక్కాలని పచ్చిపచ్చి నిజాలు తెలుసుకుంటున్న' 'ప్రజల్ని రెచ్చగొట్టే వుపన్యాసాలు' ఇచ్చినమాట నిజం. బుకాయించే ఉపన్యాసాలు, బుదగరించే ఉపన్యాసాలు, ఓటుకోసం వచ్చి, సీటు ఎక్కినాక బూటు చూపించే ఉపన్యాసాలుకాక నికార్సయిన మాట చెప్పి ప్రజల ప్రతిఘటనను సమర్థించిన మాట నిజం. ప్రజల పోరాడే హక్కును ప్రకటించిన మాట నిజం. 'నిషిద్ధమైన నాటకాల ప్రదర్శన'– 'నిషిద్ధమైన నాటకాలా?' ఏవవి? ఎక్కడున్నాయి? అవి నాటకాలు కావు, భూస్వాములకు, దోపిడీ దొరలకు నిషిద్ధమైన నిజ పోరాట జీవితాల కళారూపాలు. 'రెండు నెలల క్రితం ఒక గ్రామంవద్ద పోలీసుల బృందాన్ని తీవ్రవాదులు ఒక రాత్రింతా గ్రామంలో నుండి బయటికి కదలనీయకుండా నిర్బంధంలో వుంచారు.' 'తీవ్రవాదు

అని వున్నచోట 'పరిజలు' అని చదువుకుంటే 'దాచేస్తే దాగని సత్యాలు' ప్రభుత్వమే బయట పెడుతున్నది. పోలీసులు ఆ గ్రామానికి ఎందుకు వెళ్ళారు? ఏ యువకుల్ని అరెస్టు చేయడానికి? వాళ్ళు చేసిన నేరాలేమిటి? సభ పెట్టడమా? పాటలు పాడడమా? ప్రజలు ప్రశ్నించారు- పోలీసుల్ని నిలదీసారు. 'మధ్యతరగతి రైతుల పైననే ఇట్టి అఘాయిత్యాలు జరుగుతున్నాయి.' అవును పాపం! ఉప్పుమడిగె, చిన మెట్‌పల్లి, లొత్తునూరు, సిరిసిల్ల, మంథమర్రి. కోరుట్ల దొరలంతా కోటికిపడగెత్తి, తోకచుట్ట క్రింద వేల ఎకరాలు మాత్రమే దాచుకున్న 'మధ్యతరగతి రైతులే.' వీళ్ళ మీదనే ప్రతిఘటనా అఘాయిత్యం జరగడం ఎంత నేరం? నిజమే మరి పాపం!

ఈ తాలూకాల్లో కొన్ని గ్రామాల్లో నక్సలైట్లు భూస్వాములకు వ్యతిరేకంగా కొన్ని కార్యకలాపాలు చేసిన మాట వాస్తవమేనని, ఇక్కడ నక్సలైట్ల కార్యకలాపాలు భూస్వాములకు వ్యతిరేకమైనవే కాని మధ్యతరగతి రైతులకు వ్యతిరేకం కాదని సిపిఐ రాష్ట్ర కమిటీ తీర్మానం చేసింది.

ఈ తాలుకాల్లో వ్యవసాయ కార్మికులు, రైతాంగం భూస్వాములు బలవంతంగా అమలుచేస్తున్న 'వెట్టి'కి వ్యతిరేకంగా పోరాడుతున్నారనీ గత ఆరునెలలుగా వ్యవసాయ కార్మికులు చేస్తున్న పోరాటాన్ని అణచడానికి భూస్వాములు, వాళ్ళ గుండాలు, పోలీసులు మిలాఖతై పోలీసు క్యాంపులు పెట్టారని ఇప్పటికే వెయ్యికిపైగా అరెస్టులు జరిగాయని సిపిఎం ఒక పత్రికా ప్రకటన చేసింది.

ఈ పరిస్థితుల దృష్ట్యా ఈ తాలూకాల్లో అదనపు పోలీసు బృందాలను నియోగించడం జరిగిందని వాటికితోడు మరికొన్ని బృందాలనుకూడ పంపడం జరుగుతుందనీ అధికారులు చెప్పారు.

ఎమర్జెన్సీ ఎత్తివేసి ఏడాదిన్నర గడిచినా నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటకాలంలో 'కల్లోలిత ప్రాంతాలు'గా చేసిన ప్రకటనలింకా ఉపసంహరించుకోలేదు- వరంగల్, ఖమ్మం, శ్రీకాకుళం, గోదావరి జిల్లాల్లో కొన్నితాలూకాల్లో ఇంకా పోలీసుక్యాంపులు కొనసాగుతూనే వున్నాయి. ఇపుడు వీటికితోడు ఆదిలాబాదు, కరీంనగర్ జిల్లాలు. కల్లోలిత జగిత్యాల, సిరిసిల్లలు.

ఎవరు కల్లోలాలను సృష్టిస్తున్నారు?
నీళ్ళల్లో రాళ్ళు విసురుతున్న దెవరు?
ఎగయక తప్పని అలల్ని బంధించాలని చూస్తున్నదెవరు?

ప్రజాస్వామ్య వాదులైన వారందరూ ఈ కల్లోలిత ప్రాంతాల ప్రకటన పోసిజానికి పునర్నవంగా గుర్తించి మొగ్గలోనే దీనిని ప్రజాతంత్ర ఉద్యమ ఐక్యతతో తుంచివేయాలని విజ్ఞప్తి చేస్తున్నాం.

26-10-1978 — సంపాదకుడు.

# కొలిమంటుకున్నది

అల్లం రాజయ్య

## 1

తూరుపు తెల్లారింది- సూరీని తొలుదొల్త సిర్నవ్వు ఆకాశం మీనికి ఎర్రంగ పాకింది- తాళ్ళతోపుల సిలుకలు ఒళ్ళిరుసుకొని రెక్కలు తపతపలాడిచ్చి పొద్దుపొడుపుకు సాగతం పలుకుతన్నయ్- అప్పటికే తాటి మొగుళ్ళమీన సేరిన సిలుకలు బింకుల్ల కల్లుదాగి తెల్లారినందుకు సూరున్ని, ఎలుగును కలిపి తిడ్తన్నయ్- మాఘమాసపు సలి గాలి ఎండపొడకు భయపడి తాటిమట్టల సందుల్ల దాక్కోని మల్ల నమ్మకం సిక్కక ఓ తాడిసెట్టు మీన్నుంచి మరో తాడిసెట్టుమీనికి ఆదుర్దతోని ఉరుకుతంది.

ఆగుల నీల్లు గలగల పార్తన్నయ్- నీల్లమీన సూరీడు బంగారు రేకులు దించిండు- మడుగుల్ల సిన్నసేపలు ఎగురుకుంట సూరీన్ని సూత్తన్నయ్.

పల్లెల ఇల్లిల్లు కండ్లు తెరిసింది- పొద్దుపొడుపును జూసి పల్లెజనం ఉరుకులు పరుగులు పెడ్తంద్రు- నాత్రంత రొచ్చు గుంటల్ల, దోమలు కుట్టున్న పసురాలు బజార్లల్ల లేగబొక్కల ఆఖరి సూపు సూసుకొని, ముడ్లునాకి, పాలిచ్చి, బుద్ది గానెం సెప్పి, ఒర్లుకుంట, మర్రి మర్రి సూసుకుంట, దుమ్ము రేపుకుంట కంచెల్లకు నడుత్తన్నయ్- అటెన్క గొంగడి ముసుగులేసుకున్న ముసలోళ్ళు నోట్లె మొక్కసుట్టలు పెట్కోని, ఈడిగీలబడి నడుసుకుంట ఆటిని తిట్టుకుంట, అదిలించుకుంట ఊరావలికి తోలుతండ్రు.... పెయికంగిల్లేని పసుల పోరగండ్లు లెల్లెపాటలు పాడుకుంట, పసుల తోకమట్ట లిరుసుకుంట, సెంగలిచ్చుకుంట, లాగెబొక్కలోలె ఒర్లుకుంట నడుత్తండ్రు.... ఆళ్ళెంటరెన్క ఎర్కలి తట్టలు బట్టుకొని ఆడోల్లు "గిది నా అవు పెండకడంటె-" "గిది నా బర్రె పెండకడని" ఆదులాడుకుంట పెండ ఏరుకుంటంద్రు.

ఊరి బయట కనుసూపు అందేదాక పరుసుకొనున్న సేండ్లన్ని మనుసు కురిసి బూడిది రంగుల కనిపిత్తన్నయ్- గసొంటి బూడ్దిరంగు సేన్లమీన సూరీని ఎలుగు బలే ఇచిత్రంగా మెరుత్తంది- సేన్లబందుకు దూరంగ కన్పించే గుట్టబోరుమీని పొగమనుసు కొద్ది కొద్దిగ కరిగిపోతంది.

అగో గసొంటి పొద్దాల గడ్డిమీని మనుసును తొక్కుకుంట రెండెడ్లు నడుపలేక నడుత్తన్నయ్- అయి నడిసిన జాగల్ల మనుసు పెదిరిపొయి బాటతీర్గ ఏర్పడుతంది- గ ఎడ్లల్ల ఓ ఎద్దు పుల్లది—— పుల్లెద్దయిన అదిప్పుడు తెల్లగలేదు- రొచ్చు, పెండ

అంటి ఉతకని దుప్పటితీర్గున్నది- ఇంకోటి పయ్యది- పయ్యదాని గంగడోలు మీన, ముఖంమీన బట్టతనమున్నది- రెండెడ్లు ఎన్నుమీన, తోకమట్టమీన బొక్కలు తేలి రేపో మాపో సచ్చేటట్టుగున్నయి- సావటానికి తయారుగున్న ఆటి కండ్లల్ల ఆశకు కొదువ లేదు- నెలరోజుల నుంచి గడ్డిమొఖమెరుగనట్టు, నడుసుకుంట, నడుసుకుంటనే మజ్జెల ఆగి గడ్లె మూతులు బెడ్తన్నయ్.... మూతులకున్న 'బుట్ల'ను కసికొద్ది నాలెకు రాకి మరింక ఈలుగాదని ముంగటికి నడుత్తన్నయ్- మళ్ళ కాసేపటికి మళ్ళ గదే తంతు.

ఆ ఎనక్క ఆటి మాలుకదారు నడుత్తండు.... మాలుకదారు ఎడం భుజమ్మీద 'బారెడు దొత్తైలు' పగ్గాలు, ముల్లిగట్టెకు తలిగేసున్నయి- కుడి భుజమ్మీద పారున్నది.

గట్ల ఆ ఎనక్క అడుగులడుగేసుకుంట గునాయించుకుంట నడుత్తన్నతని ఈడు ముప్పయైదు ఏండ్లుండచ్చు ... కని అతన్నిసూత్తే ముసలోని తీర్గున్నడు- మల్ల గ ముసలేషం ఈడుతో నచ్చింది గాదు- రాత్రనక పగలనక పన్జేసి పన్జేసి గూటనరాలన్ని గుంజుకచ్చినయ్- యాల్లమీన తిండిలేక కండలన్ని కరిగిపోయి తోలు ఊగులాడ్తంది- అయినె నెత్తిమీన ఎలిసిపోయిన ఎర్రగీతల రుమాలున్నది- సెంపలు పీక్కపోయి దవ డెముకలు కన్పడ్తన్నయ్- సెంపలు పీక్కపోయినయ్- గ సెంపలమీన నెల నుంచి మంగలి కత్తెరుగని గడ్డం- గడ్డంల మీసాలు- మీసాలకింద దొడ్డు పెదువుల నోరు- నోట్ల మెక్క సుట్ట- అదిప్పుడు ఓ పట్టాన ఎలుగుతలేదు- మొఖంమీన సీక్కులేని బాయిలతీర్గ కండ్లు- గ కండ్లల్ల ఎక్కల్లేని ఆశ, అందక కొట్టిపోసుకొనుడు ఉన్నయ్- ఎన్ను కంటుకపోయిన కడుపుమీన రోమాలు.... ఎండకు ఎండి ఆనకు నాని, సలికి బిగుసుకపోయి ఎర్రటి నెత్తు కాయెక్కపోయింది.

కాల్లు నిలదొక్కుకుంట నడుత్తనోడు ఏందో యాదికచ్చి జెప్పజెప్ప నడుత్తండు.

కాలం పీకేసిన బొక్కతీర్గ గట్ల నడుత్తన్నతని పేరు నర్సింహం.... పెద్దలోకు లతన్ని 'నర్సిగా'డని పిలుత్తరు.

నర్సింహం గ రెండెడ్లకే కాక రెండెకురాల నర పెరడుకు మాలుకుదారు- గ పల్లెలున్న రైతుల్ల బీదరైతు- నర్సింహం మనుసుల ఎప్పటికైనా ఎన్నపతారా లెత్తయినా పదెకరాలు సంపాయించాల్నే ఇసారం పురుగు దొల్సినట్టు తొలుత్తుంటది- గ ఇసారం కూకుంటె కూకుండ నియ్యదు, నిలబడితె నిలుసుండనియ్యదు- ఇన్నేండ్ల బట్టి అంబలి నీల్లనకుంట, కట్టం సుఖమనకుంట- అచ్చేటముచ్చేటనకుంట నాత్రిపగలు గ రెండెకరాలనర పెరట్ల పంత పాతరబెట్టుకున్న ఇత్తు మిగిలిందిలేదు- కొత్తచ్చింది

లేదు- కోరిక తీరిందిలేదు- ఇత్తనమేసిన కాన్నుంచి ఏటా లెక్కలుగడ్తడు నర్సింహం- కర్చిలు పెరుగుతంటె ఆశలు పెరుగుతయి- ఆనో ఆరుపో అత్తది- గాలో దూలో తోల్తది- మిలమిల సూడంగ పొల్లు బొరుసు పోంద ఇంటికచ్చిన ఇత్తులకు ఎయ్యి మందురెకత్తరు- కోమటోడు "కయికీల్లకు దెచ్చినయ్" తెమ్మంటడు- "మందు బత్తాల కిచ్చినయియ్యవుర నర్సిమ్మ" మరొకడు- "నర్సిమ్మగ బట్టల బాకీ...." గిట్ల అందుక పోయెటోడందుక పోంగ- నర్సింహంకు మిగిలేది మర్కోపేటికి ఆశ- ఆ మర్కో పేడు మల్ల గట్లనే అత్తది- అస దేవునికి మల్ల మొక్కుతడు.... బీటుమీన సేటుకు మొక్కుతడు.... గన్నేండ్లబట్టి సేతసేత్తంటే మిగిలింది గ రెండు బొక్కలు- రెండు రెక్కలే.

నర్సింహం ఇయ్యేటి పంట గురించి కలలు కనుకుంట- అచ్చే పైసలమీన ఆశలు పెంచుకుంట- పొగలాని సుట్టను తాక్కుంట- మజ్జె మజ్జె తుప్ప తుప్ప ఊంచుకుంట నడుసుకుంట ఎడ్లను అదిలిస్తుండు.

నర్సింహం ఎనుక అడివి పిట్టసొంటి పిల్ల ఎల్సిపోయిన పచ్చలంగనెగగట్టి, పచ్చగడ్డిని, గడ్డిమీని మనుసును తాడిసెట్లమీన లొల్లి సేసుకుంట ఎగుర్తున్న రామ సిలుకలనూ, పొడిసిన పొద్దును, ఇచ్చిత్రంగ, సంబరంగా సూసుకుంట- నడ్సుకుంట నడ్సుకుంటనే కుడిసేపు ఆగిపోతంది.... మళ్లేదో గుర్తుకచ్చి తాడిసెట్ల కింది కురికి తాటిపండ్లు ఏరుకొని కొంత దూరందనుక మోసుకచ్చి మల్లీ క్యాల్లిదొర్లో ఆటిని ఇసిరేసి నవ్వుతుంది తంగెడు పూవుల మాసిన నెత్తిల పెట్టుకొని ముసి ముసి నవ్వుతంది. రేకులాడబీకి నోట్లెబెట్టుకొని ఊదుతంది ముక్కుల్నుంచి అదేపనిగ కార్తున్న సీమిడిని సర్రున ఎగపీల్సి, కండ్లమీన కప్పుకపోతన్న ఎంటికలనెగదోసుకుంటంది.... ఉండి ఉండి ఏదో కూనిరాగం తీత్తంది- "మీయింటెన్క మాయింటెన్క ఏమేమి గుడ్డలు పోత్తామక్కా ఓరాసగుమ్మడీ...." "సెల్ సెట్టు లెక్కగలనే సెంచితా-" అంటంది.... గ పిల్ల ఈడు పదేండ్లు...."

ముంగట నడుత్తన్న నర్సింహం ఆగి ఎనుకకు సూసిండు- పిల్ల ఎనుకెక్కడో బీరపోయి నిలుసున్నది- నిలుసున్నది ఉరుకుత ఆగు నీల్లల్ల కురికి నీల్లల్ల ఆడ్తంది- "అటకోయిల పోరి- అగ్గానెంబున్నది- పాపం ఏడాదుకునేటిదో? ఎల్లువానులేక దాన్ని సుత పనికంగబెల్తున్న.... దొరలమా? దాతలమా నాల్రెక్కలాడ్తెనే గవ్వ మిగిలింది లేదు...." నోట్లె సుట్ట దీసి కొస నుసి దులిపి పట్టుకున్నడు.

"సత్తెవ్వా, ఓ సత్తెవ్వ.... జెర జెపజెప రాయె పొద్దెక్కుతంది- సూడు బిడ్డ ఎంత పొద్దెక్కిందో? సీకట్ల లేపుతెనేమొ శివంతాలుతివి- మల్ల అదేపాయెనని జర

పొద్దుపొడిసినంక లేపుకత్తె ఆటలాడవడ్తివి- సూడు ఎవడన్న గివ్వారుదక్క. మోట గట్టకుంటున్నడా? ఇవ్వారికే పదిగాల కాలువలు తడిసిన యాండాలె అందరియి.... గిట్లయితే మక్క పెరడి ఎప్పుడు తడితిరుగుద్దే?- నీ కాల్మొక్కత, నీ బాంచెన్ మా అవ్వపుగాదు.... జెర కాలాడియ్యి.... మల్ల అంబటాల్లయ్యిందంటే అకలైతందని అడికీడి కెగురుతవ్.... నీ కట్టం కిట్టపరమాత్మునికి ముట్టి గ కరంటు మోటర నీల్లు బోసిందంటె సత్త వడుత నేనే నీల్లుగట్టుకుంట.... మీ అవ్వనన్న తీస్కపోదామంటే పోరగండ్లతో నెగుర్తివి గని కూడండక పోతివి...."

"నేను ముసలిముండనారా లంజకొడుక? నీఅవ్వ పాలికెక్కి పోయిండిగాదుర.... సచ్చిన దాన్నంటవా నన్ను? అట్లయితే నీల్లు గిల్ల జాస్తసయి- నేనింటి కురుకుత- ఇగో ఉరుకుతన్న...." సత్తెమ్మ అరిసి ఊరుదిక్కు తిరిగింది.

"ఓ నీబాంచెన్ తప్పయిందే, మా అవ్వపుగాదు దొర్సానివి- ఇంటాన్నావే? మూరె నీ కాలుకున్న సిరి మా అవ్వ మొఖానికి సుతలేదు- నీబాంచెన్ నన్నదిరిచ్చు కోకుంట రాయే...." నర్సింహం బతిలాడిండు.

"గట్ల తొవ్వకు రా?.... అత్తనపా...." కేకేసి పరుగందుకున్నది- సిటికెల నర్సింహంను సేరుకున్నది- కూరుకుపట్లు పడుకుంట నడుత్తన్న బక్కెడ్లను అదిలిచ్చింది.

ముసలెడ్లకుసుత పిల్ల ఉశారచ్చి పరుగందుకున్నయ్- అట్ల ఎడ్లను గెదుముకుంట సూత్తమనేటాల్లకు పెరట్లకు సేరింది- బాయిగడ్డమీనికెక్కి సేతులూపుకుంట తిట్టింది.

నర్సింహం ఇసారాలు కట్టిపెట్టి జెపజెప నడిసిండు- మోటబాయి కాడి కచ్చి సుట్ట ఆఖరి పీల్పు పీల్సి ఊంచిండు- ముక్కుల్లనుంచి పొగ తీసుకుంట ఊంతడితోని సుట్ట మలిపి కుడి సెవు సందుల దోపుకున్నడు- తల రుమాలిప్పి ఝాడిచ్చి, కొసలు మడతబెట్టి కొమ్ము రుమాలు సుట్టుకున్నడు- మోట బార్లకు కదురుకు మొక్కి తొక్కుడు పట్టెల మీనికి నడిసిండు- దండెద మలుగు తాడిప్పి బొక్కెన నూతిల కిడిసిండు- మోట బార్లలకచ్చి ఎడ్లను సెరికితీసి మోట గట్టిండు.

"నాయినో, మన పెరట్ల కరంటు కంభాలెయ్యే....? ఓరినాయిన్నో కంభాల తీగె సుత లేదే!" సత్తెమ్మ కరంటు మోటర షెడ్డుకాడ నిలబడి మొత్తుకున్నది.

నర్సింహం గుండె ఆగిపోయినట్లయ్యింది- బీర్పోయి నిలుసున్నకాన్నే నిలు సుండి పెరట్లకు పారసూసిండు- గుడిసేపటికి తేరుకొని పెరట్ల కురికిండు.

కంభాలు ఉండే జాగల పొక్కలున్నయ్.... ఆ పొక్కల సుట్టూర మక్క కర్ర లన్ని కస్సపిస్స తొక్కున్నయ్.... భూమ్మీద దిగబడ్డ అడుగులున్నయ్.... ఇరిగిపోయిన మక్క కర్రలను లేవట్టి పిచ్చిగ సూసిండు- పొక్క పొక్క కాడికి కాలుగాలిన పిల్లోలె తిరిగిండు- ఏడ సూసిన గదే తంతు- ఎటూ సమజ్ కాక నెత్తిమీని రుమాలూడబీకి పరపర గోక్కున్నడు- గడ్డం గోక్కున్నడు- పిచ్చిలేసినోనితీర్గ నెత్తెంటికలు పీక్కున్నడు- మొఖంమీద అరిసేతులతోని ఒత్తుకున్నడు- గడ్డాన్ని పిసుక్కున్నడు- ఏం దోసటంలేదు- ఎవలు పీకింద్రో ఎరికయితలేదు- అంతమాయ- గారడోడు గప్పుడే రూపాలు సూపిచ్చి సంచిలేసు కున్నట్టుగున్నది- సచ్చినోడు లేసి నడుత్తన్నట్టుగ మోటరు షెడ్డుకాడికి నడిసిండు- తలుపుతీసి కరంటు మోటరను సానాసేపు సూసిండు- భుజంమీని రుమాలు తీసి దుమ్ము దులిపిండు— మల్లేమనుకున్నదో నిట్టనిలువుగ నిలుసుండి కాండ్రికిచ్చి మోటరుమీన ఊంచిండు- "మోటరట.... మోటరవ్వను కుక్కలు దెం...." పెద్దగ తిట్టి ఈవల కచ్చిండు- బాయిగడ్డమీనికెక్కి నొసలుకు సెయ్యడ్డం బెట్టుకొని సుట్టూర సూసిండు.

నాయిన్న సూపులు సమజ్‌కాక ఏం ముంచుకరాగలదోనని ఏడుపందుకున్నది సత్తెమ్మ.

గట్లసూసే సర్సింహం టక్కున ఆగిండు- ఆగి మల్ల సూసిండు- "పీసవ్వ లంగ పెండ్లాం ... పీసవ్వ గులాఫ్ లంజకొడుకు.... నా పెరట్ల అద్దుమ నాత్రి కలిక గాంధారోల్ల కంభాలు పీక్కపోయింద్రు.... నా ఇల్లు నిలువుత ముంచింద్రు-" గిట్ల అన్నమాటనకుంట ఆలి నక్కను మునుంబెట్టి తిట్టుకుంట, గొంతిక సినిగిపోయేటట్టుగ అరుసుకుంట, గెట్టుపొంట ఉరుకుతండు.... పెరడిదాటిండు.... ఉరుకచ్చి ఉరుకచ్చి కంటిసూపు అందేదనుకున్న మిరుపతోట గెట్టు సేరిండు- సెట్టుగిట్లని సూడకుంట మిరుపసెట్లు కాల్లకడ్డం పడ్డా లెక్కసెయ్యకుంట తోట్లబడి ఉరుకుతండు- అట్ల ఉరికి ఆగిండు.

ఆడ ఇద్దరు మనుషులు ఓ పొక్క తోడుతంద్రు- ఇంకొంత మంది కంభాల సుట్టు నిలుసున్నరు- ఒకడు గడ్డపారందుకొని పోటుపోటుకు మూలుక్కుంట తవ్వు తండు- ఇంకొకడు పొక్కల నిలుసుండి మట్టెత్తి ఒడ్డుమీన పోత్తండు- అళ్ళిద్దరికి నూరు గజాల దూరంల మరో యిద్దరు ఇంకో పొక్కతోడుతంద్రు. కొంచెం దూరంల ఆరుగురు మనుషులు తవ్విన పొక్కల కంభాన్ని నిలుసుండబెట్టి మట్టి కూడుపుతంద్రు- తెల్లబట్టలోడొకడు కూసంత దూరంగ నిలుసుండి కంభం లైనుకున్నదో లేదోనని ఒరిగి

సూత్తండు- ఆడే మజ్జె మజ్జె 'అటూ' 'యిటూ' అని సైగలు సేత్తండు- ఇంకొంచెం దూరంల పాతిన కంభం కొసలకు కాసారాలు పిటుసేత్తండు ఇంకోడు- ఈళ్ళందరిని సూసుకుంట- తలాడిచ్చుకుంట- గుడ్లు మిటకరిచ్చుకుంట- పెత్రి ఆ సేతుల నుంచి ఈ సేతులకు, ఈ సేతుల్నుంచి ఆసేతులకు మార్చుకుంట- సింగులు తన్నుకుంట- అటీటు తిరుక్కుంట- పనోల్లను ఏగేసుకుంట- జారిపోతన్న కండ్లద్దాలను మళ్ళ మీనికెక్కిచ్చు కుంట- ఇంకొకడు పచ్చిమిరపకాయ తీర్గ మెరమెరలాడ్తండు.

"ఏమాయెర్రా లంజకొడుకుల్లాలా? ఆనల దున్నపోతోలె ఎటూ కదుల్తలేరు- ఆడిదాడ్నే పిర్రలు మెంద్రకిత్తంద్రు- పారీ! పొక్కలు తోడేటందుకే ఏండ్లుబడ్తె.... ఇగ కరంటచ్చెటాల్లకు ఎంటికల్ నరుత్తయ్- దొరత్తే సెప్పుర్రా, సెప్పిసురుతడు- మీదేంబోయింది? నాకు మాటత్తది- ఊఁ.... కానియ్యి.... కానియ్యి" తొందర సేసిండు.

తొందర పెడ్తున్నాయినె పేరు బాలమల్లు- మల్ల మనం గ పేరు జెప్పుతే గ ఊళ్ళోల్లు కిందికి మీనికి సూత్తరు- 'షేకెదారు' అంటే 'ఓ గాయినా' అంటరు- గిసొంటి షేకెదార్లు దొరకింద సానమందున్నరు- గీ ఊళ్ళనే ఇద్దరున్నరు- ఇద్దరున్నా బాలమల్లుదే ఖదర్- ఇంకో షేకెదారుపేరు రాజయ్య- రాజయ్య ఎట్ల షేకెదారయ్యిం డోకని ఎవలజోలి అర్తకు బోడు- తన పనేందో తనేందో? బజాట్ల నడిత్తె కుంటి ముసల్ది సుత కూకున్నది లేవదు- అబ్బో గీ బాలమల్లు షేకెదారయితె........ ఇగ సెప్పవశంగాదు- మళ్ళ గీ షేకెదార్లంత ఏంజేత్తరంటే.... దున్నిత్తరు- దోకిత్తరు- కొట్టిత్తరు- గరిసెల్ల ఇత్తూ దినం పోపిత్తరు- సేతమొత్తం ఈల్లమీన్నే నడుత్తది.... దొరకు ఊరూర భూములున్నట్టుగనే గీ షేకెదార్లున్నరు.

అందరు షేకెదార్లల్ల బాలమల్లు దొరకు అతి దగ్గరోడు- గందుకనే ఆ ఊళ్ళోల్లు బాలమల్లును 'సేబిచ్చగాడు' అంటరు- దొర లేనప్పుడు దొరంతటివాడు- దొరతీర్గనే సూత్తండు.

బాలమల్లు నోరిప్పిండంటె తిట్లు రాల్తయి.... ఇగ సెయ్యెత్తిండంటే ఎవనిపో పలుగుతది- కనుబొమ్మలు ముడేసిండంటె అయిపాయె ఎవని కొంపకో ఎసరచ్చిం దన్నమాటే- తొవ్వెంబడి నడిసిండంటే ఆని సూపు మంచిదిగాదు.... పడుసు పోరీలు అయినె కడ్డంరారు- ముసలోల్లు ముంగటికేరారు- 'గవ్వల కోడిపుంజులు' తొవ్వకడ్డం రావు- అచ్చిన యనుకో, అయి అతెనెంట ఇంటికి నడువాల్సిందే- అందట్ల కొన్ని దొరిల్లు సేరాల్సిందే- దొర 'అ' అన్నడంటే "అంకమ్మో, ఆగమ్మో"నని 'సు' అంటే

"సుందరమ్మో, సుగుణమ్మో"నని సమజ్ సేసుకునే ఘనుడు– గసొంటి బాలమల్లు ముక్కు కొనదేలుంటది– పెదువులు తిట్టి తిట్టి బండబారిపోయినయ్– ఆ పెదువుల మజ్జెన తిట్లు లేనప్పుడు పొగాకు సుట్టుంటది– అతని మీసాలు కోసిన తుంగ పోసల తీర్గుంటయ్– తుంగపోసల పక్క కూకున్న కప్పసొంటి ముక్కుమీన సత్వారవు కండ్లద్దాలుంటయ్– అద్దాలెనుక నక్క సూపులుంటయి– మీదినుంచి సూత్తే మాలేసగుంటడు కని అతను కారునబడితె అమరకుంట గట్టిగనే ఉన్నడు.

"పన్దొంగ లమ్డికొడుకుల్లాలా! ఊఁ.... ధనాధన్.... కానియ్యండ్రి...." మల్ల అరిసిండు– అడ పన్జేత్తన్న పాలేరోల్లంత గ తిట్టుమాటను పట్టిచ్చుకున్నట్టులేదు– మళ్ళ బాలమల్లు ఏగిరపెడ్తె ఏగిరపడకుంట ఎప్పటి తీర్గనే పన్జేసుక పోతండ్రు– ఒక్కనాటిపనా ఏగిరపడటాన్కి– బల్లి గు.... దారమోలె ఎన్నటికి ఎడతెగది.... కాల్లె బద్దైతప్ప కాలుసెయ్యి ఆడియ్యాలె– గట్లయితెనే దవుడలాడ్తయి.

నర్సింహం గిదంత సూసి కంభం నిలబెట్టే కాడికి ఎకాఎకి ఉరికిండు.

"వారీ! దొంగ గాడ్దికొడుకుల్లాలా.... అవ్వయ్య దెం.... సంపాంచిన యనుకున్నారా గీ కంభాలు– నా పెరట్లయుర్రా, నా పెరట్లయి– అద్దమనాత్రి పీక్కచ్చి అవ్వల మిండెల సొమ్మైనట్టు మిరుపతోట్ల నిలబెడుతండ్రా?"

తెల్లటి లాగులాయినె మొఖం సిట్లేచ్చిండు తునికి కొర్రాయోలె. బాలమల్లు తోటల పండ్లు పటపటగొరికి అడుగు ముంగటికేసిండు. అడుగు ముంగటికేసి పండ్లు గొరుకు డాపి పకపక నవ్విండు.

"నర్సిమ్మా, పిసగిన లేసినాదిరా?" అని నర్సింహంకు నిచ్చెంగనే పిసలేసినట్టుగా నిర్నాయము సేసుకొని సెత్రితోటి తెల్లబట్టలాయన్ను సూపెట్టుకుంట–

"అగో! గక్కడున్న దొరెవలో సూసినావురా. బద్దుమాషి! కరంటు దొరరా! కరంటుదొర– మల్ల గకరంటుదొరే సయంగచ్చి పీకిచ్చిండు లమ్డికొడుక! ఎరికయ్యిందా?"

కరంటుదొర కండ్లు ఫులపొడిసిండు– అంతవరదాక "గీమోటు ముండకొడుకు ఖాతరు సేత్తలేడనే బాధుండేది. గిప్పటికైన బాలమల్లు తెలియ జెప్పిండు" అనుకున్నడు మనుసుల.

"ఎవలకు దొరాడు! దొరలేదు ధాతలేడు– కరంటోడా? కటికోనికన్న కరుకు లంజకొడుకులు. ఆల్లపేరించే శలీరమంత అగ్గయి మండుతంది. ఆర్నెల్లనుంచి, అళ్ళ సుట్టు తింపుకుంటండ్రు. దగుల్బాజీ లమ్డికొడుకులు." కాండ్రకిచ్చి ఉప్పుక్కనఊంచి

కరంటాయినె కెదురుగ తిరిగి "వారీ! ఎవనివిరా లాగులోడా? నువ్వెవనివి? కరంటో నివో కట్టబోతువో నాకేమెరుక? కరంటుఁబెట్కోని పుట్లు పండిచ్చుకోంంౘ్రి గవరి మెంటు నాలంజెపియి జేత్తదని. అదిజేత్తది ఇదిజేత్తది ఊదరగొట్టి బొంకిచ్చి, బోర్లేసి-నానబడగొట్టి గొౖరెపిల్ల నెత్తుకపోతిరి. ఆడెవ్వడో అనవ్వను సాకలో దెత్తుకపోను పెద్దొర మీనున్నడని బియ్యంబత్త కొంటబోతిరి. సుప్పనాతి మొఖమోనికి నవారు మంచం సేయించిత్తి. ఇంకేంబెట్టాౖలా పెండలమూతి. ఇగచ్చె అగచ్చెనని కాల్లగడు వులు మొక్కించుకుంటిరి. తీడంగ తీడంగ గునుసుకుంట కంభాలు పాతుతిరి. తీగెసుట్టి అరిసేతుల అయికుంటం సూపితిరి, ఆఖరుకత్తె మూతిమీన తంతిరి. మల్ల పీక్కపో నచ్చిన నువ్వెవనివిరా?" అని గద్దరాంచి కరంటాయినకెల్లి ఉరికిండు.

కరంటాయన బాలమల్లుకెల్లి నడిసిండు.

"నర్సిమ్మా! కండ్లు సాలెకొౖరపట్టోలె నెత్తికెక్కినాయిరా? దొరరా! ఎవలను కుంటన్నవ్? అత్తికాడి మిత్తికాడోడను కుంటన్నవా? ఎ. ఇ. దొరగారౖా? నీయక్క నీకు మస్తెక్కిందిరా? నీ...." తిట్టి అయినెవలో ఎరుకజేసిండు.

ఎ. ఇ. మాటినంగనే నర్సింహం టక్కున ఆగిపోయిండు. ఎనుకముందు గునా యించుకున్నడు. ఎ.ఇ నిడిసిపెట్టి మళ్ళ కంబం కెల్లురికిండు.

"ఎవడైతే నాకేంది? ఏలంజకొడుకు, ఉదరులేకుంట నాపెరడంత తొక్కిండు. ఎన్నిగుండెలుండి నాపెరట్ల కంభాలు పీక్కచ్చిండు. మొండోడ కంభాన్నిపుంౘ్రి." కంభంకాడికురికి- దాన్ని కావలించుకున్నడు.

ఒంటినాగలి నర్సింహం, తీనపోతె తిండికిలేని నర్సింహం గిట్లమాట్లాడంగ ఎప్పుడినని పాలేరోల్లు ఖీరిపోయి సూసుకుంట నిలబడిపోయింౘ్రు.

బాలమల్లుకు కోపం ఎక్కిపోయింది. నెత్తిమీనికి పొద్దచ్చెటాల్లకు పనికాకపోతె, దొర గండుమెండు సేత్తడు. "సూత్తరేంర ఆడిబట్ల లమ్డికొడుకుల్లాలా? ఊఁ కాని య్యుండ్రి- అన్నినాలుగుదన్ని మెడల్‌బట్టి అవలికి దొబ్బుండ్రి.... పనిగావాలె."

"ఏ లంజకొడుకు నామీనికత్తడో సూత్త?"

అన్నిదెబ్బలుతిని, కాలాన్ని కరువును, కోపాన్ని- దుఃఖాన్ని సూసున్న పాలే రోల్లు నర్సింహం కడుపునొప్పేందో, ఆరాటమేందో సమజ్ సేసుకున్నరేమొ, ఉల కుకుంట పలకకుంట పనిసేసుక పోతంౘ్రు- ముసలిపాలేరోడు మూలుకుకుంట గడ్డ పార ఆడిత్తనే ఉన్నడు.

మట్టెత్తుతున్న పడుసు పాలేరోనికి "ఆడిబట్ల" మాటన్నందుకు రోషం పొడుసుకచ్చింది బాలమల్లుకెల్లి మారేసిసూసిండు. మళ్ళ తలదిప్పుకొని నిట్టనిలువుత నిలుసున్న నర్సింహంను సూసిండు. గుపిక్కున ఒడ్డుమీనికెక్కి "ఏందెహెఁ ఇప్పటి మాటేంది." దున్నపోతోల్గె అరిసిండు. మళ్ళ కొంతదూరం నడిసి.

"దెహెఁనర్సయ్యా! ఉసిల్లుబుక్కిన కొడిపుంజోల్గె ఎగుర్తున్నవ్ గిద మామీనెగురు తేమత్తది. అంతలావు బలిజెముంటె దొరింటికిబోయి దొమ్మరిజ్జె సూపెట్టు." అని నర్సింహం జబ్బపట్టి బలంకొద్ది నూకిండు.

అధాటుగ నిల్సున్న నర్సింహం ముక్కుమూసుక బోర్లబొక్కల పడ్డడు. పడ్డోడు లేసి మొఖం తడిమి సూసెకున్నడు. ముక్కు బెదిరింది. ముక్కులనుంచి నోట్లెనుంచి నెత్తురు చిమ్మింది. నెత్తురు సూసెటాల్లకు నర్సింహంకండ్లు ఎరుపెక్కినయ్. తాడుతెగిన బానంబద్దోలెలేసి పడుసోని మూతిమీన గుద్దిండు. గుద్దుకు పడుసోని కండ్లుతిరిగినయ్. సేతుల పట్టిరాసుకొని నర్సింహంను వాటేసుకున్నడు అయిపాయె. ముదిరిపాయె ఇద్దరు కాపుకచ్చిన మిరపతోట నలుగుడు పడంగ ఒకల మీనొకలు పొర్లిండ్రు. ఫెడీ పెఢీన గుద్దుకున్నరు.

అడ పన్జేసెటోల్లంత ఇసిరెలు ఏడియాడ పారేసి ఉరికచ్చిండ్రు. ఉరికచ్చినోల్లు సోద్దెంసూసుకుంట నిలుసున్నరేకని ఎవడు ముంగలబడి ఇడిపియ్యలేదు. ఎవలు పెదవులిప్పలేదు. ముసలి పాలేరోడు ఎందుకనో నొసలంత ముడుసుకొని కుడిసేత కొట్టుకున్నడు. "సాట్ల తౌడుబోసి కుక్కల తాకులాట బెట్టిచ్చినట్టు." అనుకున్నడు తనండ్ల తనే.

తాటిమొద్దసొంటి పడుసు పాలేరోడు నెత్తురు మీసున్నోడాయె. ఆఖరుకు నర్సింహంను కిందపడేసి మీనెక్కిండు. గుభేల్ గుభేలున గుద్దిండు. అఖరుగ పక్కలో ఓతన్నుతన్ని, సేతులు దులుపుకొని ఈరాధి ఈరునోలె సాతుబ్బిచ్చి మాదండిపని సేసినోనేలె బాలమల్లుకెల్లి సూసిండు.

బాలమల్లు మలిగిపోయిన పొవాకు సుట్ట మళ్ళ అగ్గిపెట్టె గీకి ముట్టిచ్చుకున్నడు. ముసిముసి నవ్వుకుంట 'తాటిమొద్దు' కెళ్ళి 'షెబాష్' అన్నట్టుగ సూసిండు. గాయింత దానికే కిందమీదయి ఉబ్బిపోయి మళ్ళింకేం చెయ్యాల్నో ఎరుకలేక నిలబడ్డడు.

అంత వరదనుక కీరిపోయిన పాలేరోల్లు తలొకతీర్గ గులుక్కుంట ఎవల పనిమీనికాళ్ళు ఎల్లిపోయిండ్రు.

నర్సింహంకు గిదంత ఉల్టా ఉన్నట్టు అనిపిచ్చింది- తల దిమ్మెక్కిపోయింది- మనుసు మొద్దుబారిపోయింది- సానాసేపటి దనుక పడ్డ కాన్నుంచి లేవలేదు- కాసేపటికి బలిమిటికి లేసి కూకున్నడు- ఎటో సూసుకుంట ముఖం తుడుసుకున్నడు.

అంతవరదనుక ఎక్కెక్కిపడి ఏడ్సుకుంట ఏంజెయ్యలేక నిలుసున్న సత్తెమ్మ ఏడ్సుకుంటనే రివ్వున ఉరికచ్చి, ఎటూతోసక మట్టిపెల్లందుకొని పడుసోని మీదికిసిరింది. అడు గుర్కాయించి సూసి "పోరీ.... నీయక్క ఆడిదాకత్తె రెండు గాల్లందుకొని బండగ్గొడుత ఏమనుకున్నవో?" నని తిట్టిండు- అంతటితో నాగక సత్తెమ్మకెళ్ళి నడిసిండు- పాలేర్లోల్లు గొల్లున లేసింద్రు.... "సాలు సాలు పతాపం పసిపోరిమీనికి బోతన్నవా? ఓరి లమ్డికొడుకా ఇగరా? నీ అంతు పనెవ్వడు జేత్తడ్రా? నువ్వు లడాయిలు సేసుకుంట కూకుంటె...." నన్నరు.

అంతటితో టాగిపొయి ఇందాకటి పొక్కకాడికచ్చి పారేసిన ఈత తట్టందుకున్నడు.

సత్తెమ్మ నర్సింహం గడ్డానికి, నెత్తికి అంటుకున్న మట్టిని దులిపింది- తండ్రి ఏడుత్తండేమొననుకొని తనలంగ కొనతోని కండ్లు తుడిసింది.... రెక్కబట్టి లేవట్టింది.

బలిమిటికి నిలుసుండి ఓపారి అందరి ముఖాలల్లకు సూసిండు- ఎవల ముఖంల తనమీన పిసరంత జాలిలేదు- నిటారుగ దొరలోలె నిలుసున్న కంభాలమీన సెప్పలేనంత కోపమచ్చింది. కని పేదోన్కి కోపమత్తె పెదవిమీన గావుపడ్తది. పెద్దోనికి కోపమత్తె పేదోని ఈపు మెదుగుద్ది- తీగసుట్టను సూసిండు.... కూసం ఇడువని నాగుంబాము సుట్ట సుట్టుకొని పన్నట్టనిపిచ్చింది.

"వారీ! ఎడ్డిబానా! ఈడుమీదుండి, నెత్తురు మీనుండి- కిందమీద సూడకుంట బాలమల్లు ఎగేసినమోలె నామీన ఇరుసుకపడి కొట్టినవ్. కొట్టుబిడ్డా కొట్టు! లంజకొడుల్లాలా...." గొంటికలో ఏడుపులుంగలు సుట్టుకపోంగ మాటరాక అయిందికాన్ది అదురుకుంట సత్తెమ్మెంట అచ్చిందారి బట్టిండు.

పెయిమీన దెబ్బలు మండుతన్నయ్. ఇంకోదిక్కు అందరి ముంగటతన్నులు తిన్నబాధ. అప్పుదెచ్చి ఆశపడి కొనిపెట్టిన ఇంజనుబాధ- తన కండ్లముంగటనే పాతిన కంభాలకుసుట్టిన తీగకుకాళ్ళచ్చి దొరతోట్లకు నడిసినయన్నబాధ. మళ్ళిగియ్యన్ని బాధల్ల ఇంజెనీరుమీన, బాలమల్లుమీన, దొరమీన సాతకానికోపం.

బాయిగడ్డమీన ఢీలెపడి కూకుండి "ఎడ్లనిడుసుకపొమ్మ" ని సత్తెమ్మకు సెప్పిండు. ఊళ్ళెకు బోవటాన్కి కాల్లురావటంలేదు. ఇల్లుమొఖం- పెండ్లాంమొఖం

సూడటానికి మనుసొప్పటంలేదు. ముంగటబడ్డ కట్టంకడతేరే తొవ్వేందో తెలుత్తలేదు. ఈతరాకుంట బొబ్బలుగొట్టే అగుల జొచ్చుకి పోయినట్టుందిబతుకు. కాళ్ళకింద ఉసికె కదిలిపోయింది. అవలొడ్డు కనిపిత్తలేదు. ఏ అండదొరికి బతికి బట్టగట్టి దాటగలడో? ఏ సుడిగుండంలబడి జాడపత్త లేకుంట కొట్టుకపోగలడో?

"తనకు దిక్కెవరు? దీమెవలు. ఒంటినాగలి నర్సిమ్మన్ని గీ కట్టకాలంల ఆదుకునేటోడెవడు? తనఅండ నిలుసుండి "గిది అన్నాయమని గిది నలుగురు నడిసే తొవ్వ గాదని" ఎవ్వడు సెప్పుతడు? పతాపరెడ్డిదొర పదిహేనూల్ల పట్టెదారు. తనసొంటి ఒంటి నాగలిగాళ్ళను- రెక్కలుతప్ప ఏంలేని కయికిలి గ్గాళ్ళను- మిలమిల సూడంగ బొందబెట్టి, మన్నుగప్పి- మీనికెళ్ళి నడిసిపోలేదు? ఎవడన్న ఎదురుసెప్పిండా? గిది మంచిపనిగాదని నోరిప్పిండా? ఎదురుసెప్పినో డెవడైనా మల్ల మంచినీల్లడిగిండా? మరి దొరనీ, మాలుకదారనీ ఎదురుసెప్పకుంట ఊకుంటే, పాడికిబర్లు, దొడ్లనిండఎడ్లు, ఊళ్ళనిండ ముల్లుగుచ్చ సందులేకుంట భూమున్నదొర నోటికాడి బుక్కెత్తుకపోతే? సేతులు ముంగట బెట్టుకొనీ "నాఅదురుష్టంగింతే" నని కూసుండి కన్నీళ్ళు కార్సుడేనా? గట్లఊకుంటే ఎంతవరదాకని దమ్ము మింగుడు? ఎన్నిపార్లని ఏడుసుడు. ఆనవ్వాల చెం.... ఓసడుగంట పోపిత్తే తనతోట్లనుంచి పోయ్యేదాన్ని అంకదింపి తన పెరట్ల నుంచేపిచ్చిండు. గప్పుడే అరెకరం ఖార్జపుసొంటిభూమి సడుక్కింద బాయే. అప్పటి కప్పుకు మెడకాయ తెగిన కోడిపుంజోలె ఎగిరెగిరి కాల్లు సల్లబడి....పెద్దోని కంట్లెందుకు బడాలెనని ఊకుంటి....కరంటు లంజకొడుకులు ఉబ్బిచ్చి ఆశపెడ్తె....ఆశపడి ఏదోసేసుకోవాల్ననుకుంటి.... ఆశపడ్డోని నెత్తిమీన పిడుగు బడ్డది. దానిగ్గుడుక అడ్డుమచ్చి అమాంతం సిరుసుమీన కాలేసి ఏడునిలువుల లోతు తొక్కవట్టె....

గిట్లెంత కాలం?

ఎడ్డిబానడు ఎవల బలం సూసుకొని కొట్టిండు? ఆడు అపునుసూసుకొని బలుపని బమసుతండు. అందరివాపులు, బలుపులు ఆడే అనగదీత్తడు. తన అవ్వ దొరల పడిగె దెబ్బతోనే బాయిలదునికె- అయ్య గ కోరలకిందనే నలిగిపాయే. ఆఖరుకు తనంతచ్చింది. నాతర్వాత నాబిడ్డంతు. గిట్ల పిల్ల పిల్లతరాలు అంతులమీన దొరకోరలకింద కోడిబొక్కలోలె నలుగాల్నా?" నర్సింహంకు ఏడుపత్తంది. పెద్దపెట్టున ఏడువాల్ననుకున్నడు. కని ఎందుకనో ఏడ్వలేక పోయిండు.

"తల్లీ భూదేవర! నీకడుపున్నే పుట్టి, నీకడుపుల్నే కలిసిపోతమ్. కట్టంసుఖం నీ- ఓల్లెనే అనుభగిత్తమ్. నిన్నే నమ్ముకొని బతుకుతన్న నాఅసొంటోన్ని నువ్వాదుకో

కుంచె ఎవలాదుకుంటరు. కండ్లల్లకు రకుతందెచ్చుకొని సౌరెడునెత్తురు పురిసెడుసెముట కాంగ కొట్టపోసుకుంటన్నమ్. నిన్ను నమ్ముకున్న నర్సన్నకు గియ్యాల్ల కట్టాలచ్చినయ్ సెరసెరపగిలి అని మేడలు మిద్దెలు పడగొట్టు తల్లీ!" మట్టిముద్దలు పిసుక్కుంట నోరు లేని భూమిని అదుకొమ్మని అడిగిండు.

నర్సింహం పెరట్లనుంచిలేసి బాయిగడ్డెక్కిండు. మట్టిసేతులతోనే ముఖంరుద్దు కున్నడు- మొసదీసి ఆకసంకెళ్ళి మెడెత్తిసూసిండు- ఆకసంల గద్దోటి గత్తితిరుగుతంది- అఖరుగ తల విదిలించుకొని....

"నీయక్క! ఏదైతె అదయితది? నిండనైతె మునిగిన- నిండమునిగినంక సలె క్కడిది? అన్నయిపోయినంక మిగిలిందేంది? మూడుపానాదులకాడిదుబ్బ. మెడగోసి దరువాజగ్గడుతడా? కట్టనీయ్." గిట్ల ఇసారిచ్చుకొని పెరడి గెట్టుమీన్నుంచి ఊరుదారి పట్టిండు.

అప్పటికే అంబటేల్ల దాటిపోయింది.

నర్సింహం ఆగులకచ్చి, నీళ్ళమడుగులకుదిగి దోసిడితోని నీళ్ళుతీస్కొని మొఖం కడుక్కున్నడు. ఆవలొడ్డుకెక్కి ఎనుకకు దిరిగిసూసిండు. కంభాలన్ని ఏడియాడ నిల బెట్టుడయిపోయింది. ఎవడో పోల్ మీన కూకుండి కాసారానికి తీగసుడుతండు.

గిరుక్కునతిరిగి ఊళ్ళెకెల్లి నడిసిండు. నడుత్తాంటె కందిరీగలతీర్గ ఇసారాలు సుట్టుకుంటున్నయ్.

"ఎకాయెకిన గిదేకాళ్ళమీన దొరకాడికురికి గిట్లయ్యిందని మొరబెట్టుకుంటొ, బాలమల్లడు గింతవరదనుక ఊకున్నడా? సంగతంత ఇదివరకే సెప్పిపంపచ్చు. సెప్పే దినకుంటనే ఈపు సాపుసేత్తడు. ఒక్కడుబోతె ఫాయిదా లేదు. ఊరు.... ఊళ్ళెఉన్న గింతమంది? ఏపుట్టలో ఏపామున్నదో ఎవరు సూడచ్చిండ్రు? ఎవడైన "గిదిమంచిమాట గాదు" నేనాడిదనుక అత్తపా అనడా? ముందుగాల మాలిపటేలోని సెవులేత్త. దొరెనుక దొరంతటోడు. దొరను జక్ మాంచి అడుగకున్నా! దొర మంచి కాల్లిలున్నప్పుడు "గ నర్సమ్మడు పాపం ఎటుగాని పచ్చయిపోయిండు" అనయిన అనడా? గట్లనకున్న "అట్ల గాదుబిడ్డ గీతొవ్వనబో" నని గింతమాట సాయమన్నసేసి ఎందునెర్కలేనోన్ని ఒడ్డున పడేసె ఉపాయం సూడడా?" మాలిపటేల్ గురించి గిట్లఇసారించెటాల్లకు నర్సింహంకు కూసంత ధైర్నమచ్చింది. అంతవరదన్క అడుగులడుగేసుకుంట నడిసెటోడు- పెద్ద పెద్ద జంగలేసిండు.

"అని బలుపు కాలి కూలి కామునిపెంట గానుగదరో నాయినా! ఆళ్ళ కాంత్రెక్కలు గీ భూమిల కల్సిపోను గదరో నాతండ్రీ! ఒక్కన్ని సూసి సంపేసిండ్రురో నాదేవుడా! ఆల్ల నాము సరుక- ఆళ్ళ పిట్టకు బెట్ట- ఆళ్ళ దుట్టుతనం మార్నమైపోను గదరో దేవుడా! ఎడ్డి బాసనింట్ల పీనెల్లి మల్ల గీ దెవుసమచ్చేటాల్లకు అనిపేరు మాయగదరో దేవుడా!" గిట్ల తిట్టుకుంట, అర్లిచ్చుకుంట, ఏడ్చుకుంట, సేతులార్చుకుంట, ఊసి పోయిన సిక సుట్టుకోకుంట నర్సింహం పెండ్లాం మల్లికాంబ ఎదురురికచ్చింది.

అత్తత్తనే పెయ్యంత పునికి సూసింది- గీరుకపోయిన కాడ, దెబ్బలు తాకిన కాడ కొంగుతో నొత్తింది- ఎదురుబొచ్చె పునికింది- ఏడుత్తన్న పెండ్లాన్కి- ఏం జెప్ప కుంట పరధ్యానంల పడిపోయి అశెటో సూసుకుంట ఉండిపోయిండు- మల్లికాంబ వలవల ఏడ్చుకుంట నోటికచ్చినట్టు ఇంక తిడ్తనే ఉన్నది- గుడిసేపటికి నర్సింహం....

"సనరాదే, సచ్చినోని కేడ్సినట్టు ఏడుత్తన్నవ్- నాకేం గాలే- పో పో, ఇంటికిబో- సత్తెవ్వను బీల్లలకు ఎడ్లిడుసుక పొమ్మను."

"మల్ల గిప్పుడు నువ్వేడ్కి- పోతవ్.... ఇంటికి పోదాంరా-"

"గిట్లయిందని నలుగురికి సెప్పత్త...."

"నల్గురెవలు.... గీ దిక్కుమల్లె ఊళ్ళె ఇంక నల్గురెవలున్నరు? నీ మాటెవ డింటడు? తీకునాలుతీసి దొరేదన్న సెప్పిండంటే మీనికెల్లి ఇంకేదన్న సేత్తరు.... నూతిలబడ్డోనిమీన నూర్రాల్లేసేటోల్లు గాదు గీ ఊళ్ళె నల్గురు...."

"అదిగుడుక సూడాలెగద- రాల్లే ఏత్తరో? ఎయిపంటరో? అన్ని మనమే అనుకుంటెట్ల? ఊరున్నకాడ మాదిగిండ్లుంటయి.... నలుగురున్నకాడ నారాయిడున్న డంటరు"

"గ నల్గురేలేరని గద నేనబడ్తి.... నీయిట్టం"

ఎవ్వల మనుసుల్ల ఆళ్ళు ఇసారిచ్చుకుంట- కుమ్మరాములోలె కుతకుత లాడు కుంట మూడు పానాదులు సేరుకున్నరు. మల్లికాంబ గుబగుబ సీల్లూరిన కండ్లతోని తలెత్తి మొగనిమొఖం సూసింది. కొంగుతోని కండ్లుతుడుసుకొని ఎవలో తరుముతన్న ట్టుగ ఇంటికెళ్ళి మర్రిమర్రి సూసుకుంట నడిసింది.

"పిస్సది దానికేమెరుక.... ఎవారమంటె కట్టెపుల్లలిరిసి పొయిల బెట్టుడను కుంటది. పుల్లలిరిసినట్టు కటుక్కున మాట్లాడ్తె అయిపోద్దా? ఏమో అదన్నదిసుత నిపద్దే కావచ్చు. కాకపోవచ్చుగుడుక"

ఎగుడుదిగుడు బజార్లల్ల ఏదేందో ఇసారిచ్చుకుంట నడిసిండు. అంజనేయుని గుడికాడ గుడిసేపాగిండు. ఆడికచ్చి అగి, కాల్లసెప్పులిడిసి పబ్బతిబట్టి మొక్కుతరు గ ఊళ్ళోల్లు. అలవాటుసొప్పున గండకనే ఆగిండు నర్సింహం. కని నర్సింహంకు అ గుళ్ళెరాయికి దండం పెట్టబుద్ధి కాలేదు. ఎవలో అంజనేయునిసుట్టు పదచ్చినం సేత్తంద్రు షావుకారమ్మ ఉన్నట్టున్నది. పట్టపగటేంచే షావుకారమ్మకు తీరికపడేది. తలంచుకొని మెల్లెగ అక్కడినుంచి కదిలిండు.

ఒక్కొక్క గుడిసె గుడిసెకు ఒక్కోతీరు మాటలినబడ్తన్నయ్. ఓ గుడిసెల తిట్లు, ఇంకో గుడిసెల ఏడుపులు, మొత్తుకోల్లు- ఇంకో గుడిసెల గులుగుల్లు- ఇట్లా గుడిసె గుడిసెకు ఏందేందో బాధలే....

సాకలోల్లు మాసినబట్టలు ఇల్లిల్లు దిర్గి తీస్కచ్చి ముల్లెలు గడ్తంద్రు.

ఇగ నాలుగడుగులేత్తే ముకుందరెడ్డి ఇల్లత్తదనంగ నర్సింహం అన్ని మర్సి పొయి టక్కున ఆగిండు.

ఓ గుడిసెల అప్పుడే పనిమీన్నుంచచ్చిన మొగడు పెండ్లాన్ని కొడ్తండు- పెండ్లాం ఆకిట్ల కురికచ్చి ఊరు దద్దరిల్లెటట్టు మొత్తుకుంటంది- సోద్యం సూడటానికి సుట్టు సేరిన అమ్మలక్కలు అరసేతుల్ల అంబలి గిన్నెలు పెట్టుకొని, నాక్కుంట, తీరిగ్గ తలో మాటంటంద్రు- ఎవలు గ మొగన్ని అటకాయించుతలేరు- దెబ్బలుపడ్తన్న పెండ్లానికి ఎవరడ్డపడ్తలేరు.

ఆ తొవ్వపొంటచ్చిన గూని ముసలమ్మ కుడిసేతుల ఊతకట్టె ఎడం సేతులకు మార్చుకొని నొసలుకు సెయ్యడ్డం పెట్టుకొని 'మొగోన్ని' పరకాయించి చూసింది- కట్టెపొడుసుకుంట బజాట్లనుంచి గుడిసె గలుమల కచ్చింది- ఆళ్ళిద్దరి దగ్గరికి నడిసింది- ఇద్దరిని ఇచ్చెంతర్పింగ సూసి మూతి మూడంకరలు దిప్పింది.

"ఓరి! దుద్దెగాల్ల సెందిరిగా! పెండ్లాన్నిగొట్టే మొగోనివయినావురా? ఇంటాడి దాన్ని గొట్టంది ఇది మీసం గాదన్నడట నీ అసొంటి బాడుకావు- పెండ్లాన్ని సేసుకొన్నది- ఎటువడితటు గొడ్డును గొట్టినట్టు కొట్టెటందుక్కాదురా లంజకొడుక? బుదరకిచ్చి........ నా బాంచెకొడుక! కాదంటె కాల్లు బట్కోవాలె ఏమనుకున్నవ్? వారీ! నీకు కిట్టమూరితెరికేనా? ఎరికైతే పెండ్లాన్ని గిల్లెందుకు గొడ్తవ్- గంతటోడు పెండ్లంతోని తన్నులు తిన్నడు- లమ్డికొడుక అది ఎద్దనుకున్నవ, గొడ్డనుకున్నవ- మనిషిరా!" అని నీల్లు పుక్కిలించి ఊంచినట్టుగ నవ్వింది.

ముసలమ్మ మంచిమాట సెంద్రయ్య మనసుకెక్కలేదు.

"ముసలిముండ నీకేమెరికనే.... ఆడ సచ్చిసచ్చి అచ్చేటాల్లకు గిన్నినీల్లు కాగ బెట్టిందా? కూడండిందా? పనిమీనికి ఎనకయిపోతే ఉంచుకున్నోడు ఊకుంటడా? నీతీర్గ కట్టెపొడుసుకుంట ఆడలుతీర్గే తిరికుంటె నేనుసుత సెప్పుత శాత్రపురండాలు"

"ఇంట్ల సారెడిత్తులులేవు. జీతంగొంటబోయి గొండ్లిల్లల్ల పారబోసచ్చే. సారె డిత్తులులేంది కూడెట్ల అండాలె- కంచంల కుమ్మరిచ్చుడెట్ల కుమ్మరియ్యాలె. సేపొయ్యి సోడన్ని జొండ్లుదెచ్చి గిప్పుడే ఇసురుకరానుపోయిన. అకిట్లనుంచే ఎగురుకుంటచ్చి, పెదపోశమ్మ పూనినట్టు అత్తత్తెనే ఎగబడి కొడ్తండు. అనిసేతులు పడిపోను. జెట్టలు బుట్ట. ఏడబడితాడ గుద్దిండు" ఏడుపును దిగమింగుకుంట చెప్పుకున్నదాపెండ్లాం.

"లంజెకాన నోరుముయ్యి. ఎక్కతక్కవదిరితే" సెంద్రియ్య పెండ్లాం మీదికి కోడిపుంజోలె ఉరికిండు.

పెండ్లాం గద్దనుసూసిన కోడిపిల్ల తల్లిరెక్కకింది కురికినట్టూగా ముసలమ్మ ఎను కకు ఉరికింది. ముసలమ్మ మీదికురికిన సెంద్రయ్యను....

"సాలుసాలు.... సంబరం. పోరిఅసలే అనికిపోతంది. సచ్చినపామును గొట్టి నట్టెందిరా సెందిరిగా" అని కసిరింది. సెంద్రయ్య ఏమనుకున్నడో ఏమో ఆగి పోయిండు.

సోద్యంసూత్తన్న అమ్మలక్కల్లో సెంద్రయ్య భార్యతోని ఎనకెప్పుడో జగడం బెట్టుకున్నామె ఎందుకనో కిసుక్కున నవ్వింది.

"మొగముండకొడుకింటి కచ్చేటాల్లకు అన్ని ఖైనత్‌చేసుంచాలే- లేకుంటే గుడి సేపు ఎనకైతే కొలువుంచుకున్నోడు ఊకుంటడా?" ఇంకొకతి మెటికలిరిసింది.

"అబ్బ నీబాంచెనాతె! ఇపసారి ఎల్లక్క! నెత్తిముడుసుకోను సొతగానిదానివి నీతులు సెపతన్నవ్. ఏంజూత్తంద్రెహె! లంజలాలా! ఈన్నుంచి ఎల్లుంద్రి- పనిపాట లిడిసిపెట్టుకొని మంచిపనే సేత్తంద్రు. ఒరే సెందురుగ ఒక్కదినం కాగిననీల్లు లేక పోతే సన్నీల్లు పెయిమీన పోసుకుంటె మొలుకత్తావురా? బువ్వడుంతలేదనే బుద్దున్నో నివి జొండ్లు ఇంట్లకుతెచ్చి పారబోత్తేంది? ఇంట్లపెండ్లాం ఒకతున్నదని పెయిల భయ ముంచుకో? మానాలులేవు సెత్తలకు మల్లె మన్నయిపోతెనె కడుపుకు సాల్తలేదు. మళ్ళ తాగుదెందుకో?" అనుకుంట- ఆ జగడం అంతటితోని ఆపేసి, ఇంక సాగదీయటం

మంచిదిగాదని "దొక్కు-దొక్కున" కట్టెపొడుసుకుంట బజార్లపడి నడుత్తంది ముసలమ్మ.

పతినిత్తెము గిసొంటి సవాలచ్చజగడాలు, కొట్లాటలు నర్సింహం సూత్తనే ఉన్నడు. "అత్తమీనికోపం దుత్తమీన తీసినట్టుగ" అట్టట్టిగనే ఏడేడనోతిట్లు, దీవెనలు, కొట్లు, కోపాలుపడి; గ కోపాన్ని ఇంటికాడ పెండ్లాలమీన, పోరగండ్లమీన ఎల్లదీయటం గ ఊళ్ళెనేకాదు; ఏఊళ్ళెనైనా నిత్తెం జరుగుతున్నదే. గందుకనే గ జగడానికి నర్సింహం సిన్నమెత్తు ఇలువియ్యలేదు. కని అల్లుకుబోతె పిల్లిని సంకలబెట్టుక పోయి నట్టుగ తను మాలిపటేలింటికిబోంగ గీ కయిలాటకం సికాకు కలిగిచ్చింది.

అట్ల సికాకు పడుకుంటనే ముకుందరెడ్డి పడారి గోడ పొంట నడిసిండు. పెద్దదువాజ సేరుకున్నడు.... పెద్దదువాజ తలుపులు మూసున్నయి. 'పెద్దోనికాడికి బోతున్న' ననుకొని సికాకు ముఖం మీన్నుంచి తీసేసుకొని, మూసున్న రేకు తలు పుల కాడికి నడిసిండు- కుడి తలుపుకు సిన్న కిటికీ తలుపున్నది; దాన్ని దొబ్బిండు- అది తెరుసుకున్నది.... అంగి లోపటికి మెడకాయ బెట్టి సూసిండు- ఇల్లు సడి సప్పుడు లేకుంటున్నది.

లోపటికి "పోవల్నా" "అద్దా" అని గుడిసేపు ఎనక ముందాడిండు- "ఎట్లైన మంచిదే పోవాలె" అని లోపటికడుగు బెట్టిండు.... సూట్టూత గిరేసుకున్న పడారి గోడలోపట అంతపెద్దాకిట్ల ఎటుదోసక నిలబడ్డడు- ఎడందిక్కు- ముసలి సింతసెట్టు అతని తీర్గనే ఎటూతోసక నిలుసున్నది. దాని మీన పయిడికంటె ఏందోసకనే కూకు న్నది. దానికింది ఇరిగిపోయిన కుర్సీలు, అరిగిపోయిన నాగండ్లు గట్లనేఉన్నయ్. నర్సింహం ముంగటి కడుగేసిండు. అంతపెద్ద పడారి గోడలోపట నీల్లులేని మడుగుల కొండంత తాబేలు సచ్చిపడున్నట్టుగ ఇల్లు. ఇంటరుగుమీన మాగిన తట్టుకుర్సీలు ఖాళీగ బోసిగఉన్నయ్. ఎదురుదరువాజ గోనెతట్టు పరద అదేదో ఎద్దుతోలు ఏలాడదీసినట్టు గున్నది. లోపట మనుసులు ఉన్నరో? ఊసింద్రోనన్నంత కాముష్గున్నది. లోపట ఎవలన్న ఉన్నరోలేరో నర్సింహంకు సమఝయితలేదు.

"చిందొరా!...." మెల్లంగ పిలిసిండు. గోనెతట్టుపరుద గ పిలుపుగొంతు పిసికి నట్టున్నది. లోపటినుంచి అలికిడేంలేదు.

ఈపారి జెర గట్టిగ మూడు సార్లు పిలిసిండు....

కాసేపటికి మాసిన గుడ్డపేగుల పిలగాడు పెపంతీర్గ ఈతలకచ్చి నర్సింహంను సూసిండు. నర్సింహం ఆపిలగాని సెవులమీనికి పెరిగిన ఎంటికలను, గటుక్కుండ సొంటిబొత్తను, సినిగిన లాగుమీని మసిడాగులను, మీగాలుమీది పుండును సూత్తండు.

"దొరున్నాడ్రా రామేశ?"

"కునుకు తీత్తండు."

నర్సింహం ఆకాసంలకు సూసిండు పొద్దు నెత్తిమీనికచ్చింది.

"పగటినిదుర బోతండన్నమాట."

రామేశం మాట్లాడకుంట రెండుసేతులు తలలసొరగొట్టి నెత్తి బరబర గోక్కున్నడు పండ్లుబిగబట్టి.

"ఎవడ్రావాడు?" లోపటినుంచి బొనుగూపినట్టుగ, సగం ఆవళించుకుంట-సగం అల్లాటప్పగ అన్నట్టుగ.

"నర్సన్న దొరా...." రామేశం.

"నర్సిమ్మడెవడు?"

"నేందొర నర్సిమ్మని." నర్సింహం తికమకపడ్డడు. "ఫలాని నర్సిమ్మనని' ఎట్లసెప్పుకోవాల్నో ఎరికలేక.

"ఏండ్రా నర్సిమ్మా.... పగటెంచి పనిబడ్డది. ఏందికత-" లోపటినుంచే.

"కూసంత పనిబడ్డది బాంచెను." సగంల్నే ఆపిండు- లోపటినుంచి ఈవలకు రాండ్రని అర్థంఅయ్యేటట్టుగ-

అటెనుక సానాసేపు మళ్ళేం మాటినబల్లే- ఆఖరుకు పరుదతొలిగిచ్చుకొని బగ్గ బలిసి సదుసుడే అదేదో మాదండి పజ్జేసినట్టుగా, పర్వతం కదలచ్చినట్టుగా లుంగీ; ఎడంభుజంమీమ్మన తువ్వాలతోటి ఈవలకచ్చిండు ముకుందరెడ్డిదొర- బట్టతల- నున్నగా ఎర్రగా బయట చితపతలాడ్తున్న ఎండలాగున్నడు- అతనిబొర్ర ఎర్రగా నిండుగ ఉన్నది- అతనికండ్లు ఎర్రగా కట్టుబోతోని కండ్లతీర్గున్నయి. మొఖంమీని సరిసిన మీసాలు గొరిగిత్తే నున్నగ సూనెబుడ్డి తీర్గుంటది. బొక్కున్నది కన్పించకుంట, నర మన్నది కన్పియ్యకుంట ఏడికాడ పెరిగిన కండతోని ముకుందరెడ్డి దొరతీర్గనేఉన్నడు కానిఆడురికి "చిందొర"

దొర కూసుండేందుకు ఈలుగ రామేశం తట్టుకుర్సీ దులిపిండు. అక్కడుండటం మంచిదిగాదనో, మరింక లోపట సేయాల్సిన పనేమన్న మిగిలిందో? ఎందుకనో గని రామేశం లోపలికెల్లిపోయిండు.

తట్టుకుర్సీల సెత్తపడేసిందుదొర అతికట్టంమీన– కూకుండంగనే "ఉఫ్" మని రెండుమార్లూది, భుజంమీని తువ్వాలతో మొఖంమెత్తంగా పతిపదిలంగ ఒత్తుకున్నడు. ఆసెనక్క అకిట్లమెరుత్తన్న ఎండని కండ్లు సిట్లించి సూసిండు. "నీయవ్వ ఇయ్యేడు గిప్పుడే గింతెండలున్నయ్. ఎండకాలమంత ఎట్లసచ్చుడో?" తనండ్లతనే అనుకున్నడు. గప్పుడు తీరుపాటంగ కండ్లు టపటప లాడిచ్చి ఎదురుంగ ఎండల నిలుసున్న నర్సింహంను సూసిండు.

నర్సింహం పెయిమీని దెబ్బల జేగర్తగసూసిండు. "గిండ్లతనకేమన్న గిట్టు బొబ్బైతదేమొనని" ఆశపడ్డడు. అసెనక్క పెరిగినగడ్డాన్ని, ఎండకు కమిలి పోయిన సెర్మాన్ని సూసి పెదవిరిసిండు– "మారే అస్దగ్గరేమున్నది ఊగులాడె తోలు దప్ప" అనుకొని ఏందన్నట్టుగ ముఖం ముడిసిండు.

గియ్యన్ని సూసుకుంట ఇగ జెప్పుదామని ఎదురు సూత్తన్న నర్సింహం....

"అగ్గెరుషాముల మోట గట్టబోయిన్నుండ్రి– సూతిలకు బొక్కెనిడిసి పెరట్లకు సూత్తేవున్నది? నీబాంచెన్ గుండె ఆగిపోయింది– గట్ల ఆగిపోయిన మంచిగుండు బాంచెన్.... నేను కరంటు మోటరు దెచ్చుకొని కంభాలు నాటిచ్చుకొని తీగ సుట్టిచ్చుకున్నది మీకెరికే గాదుండ్రి– నీబాంచెన్ ఏమున్నది.... గ కంభాలు తీగ మాయమయి పోయినయ్– లబలబ మొత్తుకుంట పిచ్చిలేసినోని తీర్గ పెరడి సుట్టురికిన.... ఇంకే మున్నది బాంచెన్.... పెద్దొర మిరుపతోట్ల కరంటాయన, బాలమల్లు నిలుసుండి కంభాలు పాతిత్తండ్రు– దబదబ ఉరికి 'గిదేందని' అడిగిన బాంచెన్.... బాలమల్లు మీదిమీది కచ్చిండు– ఎడ్డిబానన్ని ఉసిగొలిపిండు– అడెట్లున్నడు బాంచెన్ కారుసబడితె అమరకుంట– నేనెట్లున్న బాంచెన్?.... ఆడు అసకూసక నన్ను మిరుపతోట్ల బొర్లిచ్చిండు– గిట్ల అదుపాగ్గె లేకుంటెట్ల బాంచెన్.... ఊరుకు దిక్కులేదా? గిది ఊరా, అడివా? సంకలేవడితె ఖార్జము కండ్లపడ్తది....

ఏనుగంతోరు పెద్దొర– దొర తల్సుకోవాలెగని, నిల్సున్నకాడికి ఏది రమ్మంటె అదత్తది– అప్పుదెచ్చి ఇంజన పెడ్తి గాదుండ్రి– ఏదో మీమీ అసొంటి దొరల కాల్లు గడుపులు పట్కొని గింత ఉపాయం సేసుకుంట ననుకుంటి– బాయిబొక్కల అవ్వల్దర్జ నీళ్ళుండె– బక్కోడ్లతోని ఏమందుతయి బాంచెన్– తరైన కుష్కయిన గ రెండెకురాల సరే కాదుండ్రి– మంచిన, తేల్సిన, ఉపాసమున్న, అంబలిదాగిన గదేకాద్దొర ఆధారం. కరంటుమోటర బెట్టుకొని ఎకరంత తరి సేసుకుంటె బతుకుతనని ఆశపడ్తి– ఆశపడ్డోని

నోట్లె ఇషం పోసినట్టయిపాయె– రాళ్ళవానకు బోడనెత్తికి దంటయినట్టయ్యింది....” నర్సింహం అరుగు మీనికెక్కి– ముకుందరెడ్డి కాల్లు మొక్కిండు– సేతులు ముడుసుకోని అరుక్కిందికి దిగి నిలుసున్నడు– మళ్ళ పట్బతిబట్టి “ఇగ ముంచిన రచ్చించిన తమరే దిక్కు– ఏ దిక్కు లేనోన్ని, సిన్నప్పటి నుంచి మీ రెక్కల్ల బొక్కల్ల మెదిలినోన్ని, నోట్లె నాలుకలేని పసుర మసొంటోన్ని దొంచెన్– నాకా అయిమూల లెరుకలే.... పంచాతులు పదావు లెరికలే.... ఎట్ల భూమ్మీని కచ్చినోన్ని గట్లనే గండ్లకే పోత....” అని ఆశగా ముకుందరెడ్డికెళ్ళి సూసుకుంట నిలుసుండిపోయిండు.

“అన్నంతపని జేసిందన్నమాట” ముకుందరెడ్డి పెద్దరువాజకెళ్ళి సూసుకుంట గులిగిండు

“ఆరంరోజులకింద– మొన్నటి మంగళారం గావచ్చు తోటసూడ నన్నుసుత రమ్మనిపిలిసిండు– తోటకాడికిపోయి సూత్తేమున్నది– కడుపు తరుక్కపోయింది– నూరెకురాల మిరుపతోట పూతపిందెమీనున్నది. తెగ్లెగీల బడిపోయింది. పూతంత రూడిత్తంది– కరంటు మోటర్లు పెట్టేకాడబెట్టి పాతఅయిలింజనులు అన్నితెచ్చి అగొద్దుకు పారేసిండు ఖర్సుతప్పుద్దని– పొటవ్వాను కుక్కలు దెం.... అయ్యేమింజన్లో ఒక్కటి నడుత్తలేదు– టుకటుక మంటయ్ తుస్సుమంటయ్. బొంగుల్లనుంచి సీల్లు పోసిందయితెలేదు. దొరకులట్ల నిలువదెత్తు కోపమచ్చింది. రాదామరి.... గక్కన్నుంచే కరంటాఫీసుకు దాలమల్లును గెదిమిండు– యాల్లకు కరంటాఫీసు కగ్గితల్ల ఆడ ఇరిగి పోయిన కంభంముక్క– గజంతీగముక్కసుత అంజినమేసిసూసిన కనిపించలే– అయ్యి ఇప్పట్ల అచ్చేటట్టులేవని సేతులు పిసుక్కున్నరు. ఆదేదనో పట్నంమంతురులు సభలు జేయాల్నట– గ సభలు సరికాలమో ఆనకాలమో సేత్తరటగట్ల గిటుగింత గిటుగింతని పాళ్ళబెట్టాన్నట– అది ఊడిదనుక రావన్నట– అండ్లది అందెబోల్లకంది, ముట్టేకాడికి ముట్టెటోల్లకు ముట్టినంక గప్పుడు కంభాలకు తీగకు ఆడరియ్యన్నట– అది అచ్చే టాల్లకు దేశంబోయిన మూడేండ్లకు ఇంటికాడి పెండ్లానికి కొడుకు బుట్టినట్టయ్యిద్ది. సత్తవడుత కంభాలు సేయిత్తమన్న తీగె ఏడినుంచితేవాలె? జనుపతాడా పేనియ్య టానికి– గియ్యన్ని ఇని పెద్దొర పెద్దొరకు పైరిచ్చిండు– ఆ మీదోళ్ళు కల్లుదాగిన కోతు లోలె ఎగిరిండ్రు– ఎటుసాతగాక డి. ఇ. గాదో ఆదెవదో కరంటుపెద్దోని బోల్లుబొక్కలు నెత్తిమీన పెట్టించి తాబదల్ సేసిండ్రు ఇయ్యన్నయిపోయినా ఆడిపోయి మెదలేలా దేసిన మిరుపసెట్లు మెదలెత్తలే– మిరుపతోట్ల ఎటుసమట్ కాక ఆడికీడికెగిరిన దొరకు నీపెరట్లకంభాలు కనిపచ్చినయ్. గదీసంగతి” ముకుందరెడ్డి సాన అలిట్టపడిసెప్పిండు.

"నీకంటె దొరకే కరంటు అవుసరం ఎక్కువున్నది పిస్సోడ" అన్నట్టుగ చూసిండు.

నర్సింహం మళ్ళమొక్కిండు.

"నర్సిమ్మా గదైతెసంగతి ఇన్నవా? మల్లనేనేం జెప్పాలె? అండ్లబుట్టినోనికి పెద్దొర సంగతేంజెప్పాలె- నేనోమాటంట ఇంటవా? ఇన్నా, ఇనకున్న నువ్వేఅనుభగిత్తవ్- అయిపోయిందయిపోయింది. పెర్లిసీల్లు పెరువెనుకబడ్డయ్. కంభాలైతే వారితోట్లపడిపోయినయ్- ఇగనువు ఏడిసిమొత్తుకున్న బండగట్టుకొని బాయిలదునికినా ఆటిని ఎంటికపుందం కదలిచ్చలేవు- నేననేదేందంటే- దొరమంచి క్యాల్లిలున్నప్పుడు కాల్లమీనపడు. కనికరం పుట్టిందా నీరొట్టె నేతిలబడ్డట్టే- కరంటోల్లకు ఓమాట సెప్పుతడు అది నీనషీబు. నేనేంజెప్పాలె-" ఏందో యాదికచ్చినోనితీర్గ గుడిసేపు ఆగిండు- కనుబొమ్మలు సిట్లిచ్చిండు. గప్పుడు సూటిగ నర్సింహంను సూసిండు- "ఎడ్డిబానని జోలికెందుకు బోయినవ్" కరుకుగఅన్నడు.

నర్సింహంకు దుంఖమచ్చింది. సత్తనని బాయిలబడ్డోనికి బాయిలనీల్లులేవు- సావురాదు అన్నట్టుగున్నది.

"గంతేనంటర- దొరతోట ఎండిపోద్ది- దొరకు కరంటవుసరంగన్క- పీక్కపోయిండంటర- గట్లపీక్కపోయినందుకు అద్దుగిద్దేమిలేదా? ఉదరే లేదంటరా? తనే పీక్కపోతే కాల్లమీన బడుదేనా? కంభాలు పీక్కపోయింది దొరది నాయమేనంటరా? తమరు మాఅసొంటోల్లు గసొంటి తప్పుపనులుసేత్తె కాదని బుద్దిసెప్పే పెద్దలోకులు గదేమాటంటర?" నర్సింహం దీలెపడి అడిగిండు.

"నాయమేందిర? నాయము.... మల్ల గిందట్ల నాయమేంది అన్నాలెమేంది? అరె నూరెకురాల మిరుపతోట ఉద్దునూర్తంగ ఎండిపోతందిరా అంటే నాయంగీయమని తీకునాలు తీత్తన్నవ్ నూరెకురాలంటె మాటలారా సుక్కల్ జలజల రాల్తయ్- గదానికి పెట్టుబడే ఏలురాఏలు పెట్టుండచ్చు. రెండెకురాలనర మక్కబెరడికి గింతెగురుడెగురుతన్నవ్- అడుతనికో బుడుత దొంకినట్టున్నది ఎవారం- నాయంగీయమని గిచ్చుకోను గిదేమన్న అధాలతా? గీడ మున్సాబున్నడా? వారీ తాములుగ ఇసారిచ్చుకో నాయంగీయమని సకురాలుసేత్తే దొరకంట్లెబడ్తవ్. ఆయింక గాయింత భూమికిసుత నోసుకోవు. మనకండ్లముంగట ఎన్నిజర్గుతలేవు- ఇగో గీ తలమీని ఎంటికలన్ని-"

"గంతేనంటర బాంచెన్"

"గంతేనంటరా- అనిసాగదీసి నన్నడుగుతన్నవ్- అంతగాకుంటె మరెంతో పాల్జీకె పసిపోరన్నడుగు సెప్పుతడు- నానోటిమీనికెల్లి సెప్పిత్తావురా?"

నర్సింహం మొఖంల రంగులు మారినయ్- ఇంకేదో సెప్పాలె ననుకున్న పెదవులు అనికినయ్- కండ్లు మసక గమ్మినయ్- ఎనుకకాల్లమీన గూకున్న జిట్టపులోలె ముకుందరెడ్డి ముంగట కన్పిచ్చిండు- "సందు దొరికిందంటె మీద దునికి మెడకాయ గొరికి నెత్తురు తాగటానికి తయారుగున్నడు-" గిట్ల అనుకునేటాల్లకు కాల్లల్ల నుంచి అనుకు పుట్టుకచ్చింది.... నడిసేటందుకే సాతగానోని తీర్గయిపోయిండు.... మల్లోపారి కాల్లు మొక్కుదామని ఎక్కిన మెట్లమీన్నుంచి ఎనుక కెనుకకు ఒక్కొక్క మెట్టు కిందికి దిగి మారు మాట్లాడకుంట అకిట్లకచ్చి నిలుసుండి సుట్టూ సూసిండు దిక్కిరి దిక్కిరి.... ఎత్తుగున్న పడారిగోడ జేలుగోడతీర్గనిపిచ్చింది- ఎనుకకు తిరిగి సూసిండు- ముకుందరెడ్డి దొర అవే జిట్టపులి సూపులు సూత్తండు- అయినె కాల్లకాడ రాయేశడు కూకుండి కాల్లు పిసుకుతండు.

ఎవలో ఎనుకబడి తరుముతన్నట్టుగ జెప్పజెప్ప రేకు తలుపుల కాడికచ్చి, సిన్న తలుపు తెరుసుకొని బజాట్ల కచ్చి నిలుసున్నడు- గప్పుడే జైల్లనుంచచ్చిన ఖైదు తీర్గ, అంతకు మునుపు గ బజారును సూడనోని తీర్గ సుట్టు సూసిండు- "గడ్డలంపులతోని, బురద గుంటలతోని బజారు సుత, లేనోని బతుకుతీర్గనే ఉన్నద"నుకున్నడు. నర్సింహంకు కొద్దిగ దూరంల రెండు కుక్కలు కెలబడుతన్నయ్- బగ్గ బలిసిన కర్రె కుక్క; బక్కగున్న గజ్జికుక్క 'కుయ్యి కుయ్యి' మని ఎల్లుకలబడి మొత్తుకోంగ కరుత్తంది.... బజాట్లదే ఓ రాయి తీసి బలిసిన కుక్కను గొట్టిండు- అది 'గర్రు' మని సూసి ఎందుకనో నర్సింహం కందంకుంట ఉరికింది.... గజ్జికుక్క నర్సింహం కాల్లను షురికిసూసి తోకమట్ట ఆడిచ్చింది.

నర్సింహంకు ఎందుకనో బలమచ్చినట్టనిపిచ్చింది- అదే ఊపుతోని నడుత్తండు- గజ్జికుక్క అతనెనుక కొంత దూరమచ్చి ఎవలింట్లకో ఎల్లిపోయింది.

"ముకుందరెడ్డి దొరే.... పెద్దొర దొరే.... దొరలంత ఒక్కటి కాకుంటె ఏరేరా? కులం కులం ఒక్కటి.... దొరల సంగతంటె తెల్సిపాయె.... గ పట్వారి గొరయ్యేమంటడో? అదిగుడుక సూడాలె-" పట్వారి మతికచ్చి నర్సింహం పట్వారింటి మొఖాన నడిసిండు.

(ఇంకా వున్నది)

# ప్రజా సాహిత్య సృష్టికి ప్రాణం భూ పోరాటం

ప్రపంచంలో ఉత్తమమైన ప్రజా సాహిత్యం ఏ కాలంలో నయినా భూమి సమస్య కేంద్రంగా పోరాటాలు సాగినపుడు వచ్చిందే. ఇటీవలి చరిత్రలో తెలంగాణ రైతాంగ పోరాటం కానీ, నక్సల్బరీ పోరాటం గానీ ఉత్తమ ప్రజా సాహిత్య సృష్టికి కారణమయ్యాయంటే అవి భూమి కొరకు, భుక్తికొరకు, విముక్తికొరకు సాగిన పోరాటాలు అయినందువల్లనే, మన దేశంలాంటి వ్యవసాయ దేశంలో కొద్దిమంది భూస్వాముల గుప్పిటలో వున్న భూమి వాళ్ళ ఉక్కుపిడికిలి నుంచి విముక్తమయి ప్రజా పరం కావడంలోనే ప్రజల దాస్య విముక్తి యిమిడివున్నది. ప్రజల చైతన్యమేకాదు, ప్రజా సాహిత్యం, కళలు సృష్టించే రచయితల, కళాకారుల చైతన్యం కూడ భూమి సమస్య పరిష్కారంతో ముడిపడి పోరాటాలతో పదునెక్కుతుంది.

ఈనాడు ఆదిలాబాదు, కరీంనగర్ జిల్లాల్లో పేద ప్రజలు భూమికోసం వీరోచిత పోరాటాల్ని సాగిస్తున్నారు- విజయాలు సాధిస్తున్నారు. భూస్వాముల, వారి కావలి కుక్కలయిన పోలీసుల చేతుల్లో విపరీతమైన దౌర్జన్యాలకు, హింసాకాండకు గురియవుతూ వెనుకంజ వేయకుండా ప్రతిఘటిస్తున్నారు- ముందంజ వేస్తున్నారు, ఈ పోరాటాలతో స్పందించిన పాటలు కొన్ని మాకు అందాయి- నిజానికి ఈ పోరాట ప్రాంతాల నుంచి వచ్చే కరపత్రాలు, వార్తలు కొన్ని వానికవే కళాఖండాలుగా, ఉత్తమ సృజనాత్మక ప్రక్రియలుగా వుంటున్నాయి. చదువుకోగల వారికి వాటిలో కల్పనలను కాలదన్నే పోరాట గాథలు, కవితల్ని వెక్కిరించే కళావిలువలు వుంటున్నాయి. ప్రస్తుతానికి కొన్ని అలాంటి రచనలను పాఠకుల, రచయితల దృష్టి నాకర్షించడానికి ఈ సంచికలో ప్రకటిస్తున్నాము- రచయితల నుంచి ఈ సమస్యలను, పోరాటాలను కళ్ళకుకట్టే రచనలు, ముఖ్యంగా కథలు, నవలలు రావాలని, అందుకీ కింద యిచ్చిన రచనలు ఏమాత్రం దోహదం చేసినా మా యీ ప్రయత్నం నెరవేరినట్లేనని ఆశిస్తాం.

— సాహితీ మిత్రులు

[కరీంనగర్ జిల్లా జగిత్యాల తాలూకా, యితర ప్రాంతాల్లో జరుగుతున్న భూమి పోరాటాల గురించి ఎన్నో కరపత్రాలు వచ్చాయి- ఎన్నో సభలు జరిగాయి. ఆ వివరాలు కొన్ని 1, 15-9-78, 1-10-78 'క్రాంతి' పత్రికలో వచ్చాయి. ఆ పోరాటాలతో ఉత్తేజంచెంది అల్లం వీరయ్య రాసిన పాటలు ఈ కింద యిస్తున్నాము. — సా. మి.]

## కరినాగురం జిల్లాలో

కరినాగురం జిల్లాలో రాజన ఓరాజన
రైతుకూలి సంఘమాట ,,
సిన్నపెద్దలంతగూడ ,,
సంఘంల కలిసిరట ॥కరినాగురం॥

సడిజాము తిరిగిపాయె రాజన ఓరాజన
నిద్దురేమొ పట్టదాయె ,,
కుక్కబతుకు లయిపాయె ,,
కుమిలినచ్చె రోజులచ్చె ,,
రేపంటే భయమాయె ,,
ఓపికేమొ ఒడిసిపాయె ॥కరినాగురం॥

పెద్దోడు అకలన్న రాజన ఓరాజన
బువ్వగివ్వ లేదాని ,,
కసిరిపెట్టి నానుగాని ,,
కడుపునుండి తన్నుకొని ,,
కండ్లపొంటి నీరచ్చె ,,
ఒకపూట బువ్వకొరకు ,,
పాకులాట దప్పదాయె ॥కరినాగురం॥

కోడికూత ఇనిలేసి రాజన ఓరాజన
గుడిసెనుంచి పోతావు ,,
పొద్దంతా పనిజేసి ,,
పడిజాముకొత్తావు ,,
పొడుగునుంచి పొడుగుదాక ,,
నువ్వీరాము ఎరుగవయ్యా ,,
ఎంతజేసి ఏమిఫలం ,,
చాలినంతకూడేది ॥కరినాగురం॥

సిన్నోడికి జరమొచ్చి రాజన ఓరాజన
పన్నపక్క బొర్లలేదు ,,
మందిది మాకేది ,,
బొండతొవ్వె మందులాయె ।కరినాగురం।

సావుకారి అప్పేమో రాజన ఓరాజన
తడిసి మోపెడైతంది ,,
ఎన్నేండ్లు పనిజేసిన ,,
గింతనన్న పెల్లుగాదు ,,
ఎంతగనం ఈబాధలు ,,
ఎన్నొద్దులీఆకలి ॥కరినాగురం॥

అతుకుల బతుకయిపాయె రాజన ఓరాజన
అడుక్కతినే రోజులచ్చె ,,
ఈదలేము ఈబతుకును ,,
ఎదురించి తీరుదాము ,,
మన బతుకు మారుటకు ,,
పోరాడి తీరుతాము ,,
రైతుకూలిసంఘంల ,,
మనమింక చేరుదాము ॥కరినాగురం॥

---

## తిరుగు బాటు

పుట్టపాక ఊరిలోన ॥పుట్ట॥
అల్లరేమిటి రాజన్న
అదిఏమిటి రాజన్న
బీడుబడ్డ పరంబోగు ॥బీడు॥
నాదిఅంటడు దొరోడు
నాచేనుఅంటడు దొరోడు
వానిమీద మన్నువాడ ॥వాని॥
సాగనియ్యడురో దొరోడు
సితకతన్నరో దొరోన్ని ॥పుట్ట॥

పుల్లకుంట కట్టమీద ॥పుల్ల॥
అల్లరేమిటి రాజన్న
లొల్లిఏమిటి రాజన్న
కూలిజాలనీ లోకులంతా ॥కూలి॥
ఎక్కువడిగిరి రాధమ్మ
పనికిరామనిరి రాధమ్మ
వానిమీద మన్నువాడ ॥వాని॥
సాగనియ్యడురో దొరోడు
కైకిలియ్యడురో దొరోడు ॥పుట్ట॥

రామయ పల్లె పల్లెలోన ॥రామ॥
సమ్మె లేమిటి రాజన్న
బంద్ లెందుకు రాజన్న
రామయ పల్లె దొరగాడు ॥రామ॥
జీతమియ్యాడే రాధమ్మ
ఎట్లే అంటాడే రాధమ్మ

వాని మీద మన్నువాడ ॥వాని॥
జీతమియ్యడురో దొరోడు
పనికిపోవద్దు అనికి ॥పుట్ట॥

సింతకింది రాణి కొడుకు ॥సింత॥
ఎందుకేడ్తుండు రాజన్న
ఎవరు కొట్టిండ్లు రాజన్న
పొద్దుగాల రాలేదాని ॥పొద్దు॥
దొర కొట్టిండో రాధమ్మ
దొర తిట్టిండో రాధమ్మ
దొర మీద మన్నువాడ ॥దొర॥
సిన్న పోరడురో వాడు
దుఃఖమాగదిరో రాజన్న ॥పుట్ట॥

మాదిగోన్ని పీరిగాన్ని ॥మాది॥
ఎందుగ్గొట్టిండు దొరోడు
ఏమి అన్నాడు వాడు
మాదిగోళ్ళు ఎట్టి రామని ॥మాది॥
మర్లబడ్డారు వాళ్ళు
ముందుకచ్చిండు వాడు
వానిమీద మన్నువాడ ॥వాని॥
సాగనియ్యడురో దొరోడు
సావగొడ్తుండు మనల ॥పుట్ట॥

నిన్న జరిగిన పంచాతికాడ ॥నిన్న॥
ఏమి అన్నాడు దొరోడు
ఏమి చేసిండు వాడు
నిన్న జరిగిన పంచాతిలోన ॥నిన్న॥
దండుగంటాడు వాడు
ఇయ్యమన్నాడు ఇన్నూరు
వానిమీద మన్నువాడ ॥వాని॥
బతుకనియ్యడురో దొరోడు
విడిచిపెట్టాలె దొరోన్ని ॥పుట్ట॥

ఇద్దరు :

ఎన్నిరోజు లిన్ని బాధ ॥ఎన్ని॥
ఏమి జేద్దాము రాజన్న
ఎటు పోదాము రాధమ్మ
ఎక్కడైనా గిదే బాధ ॥ఎక్క॥
ఎటు బోవద్దు రాజన్న
ఈన్నె ఉందాము రాధమ్మ
మన మింక అందరము ॥మన॥
మర్లబడాలె దొరోనికి
బాగ తన్నాలె దొరోన్ని ॥పుట్ట॥

---

## బతుకు బాట

(ప్రతి లైను చివర ఉయ్యాలో అని పాడుకొనగలరు)

సినుకు సినుకుల వాన ఉయ్యాలో
సిత్తారి వాన ఉయ్యాలో
గంగాదారిలోన
బంగారి వాన
ఉన్నోడి లోగింట్ల
పన్నీటి వాన
లేనోళ్ల గుడిసెల్ల
కన్నీటి వాన
అంగంగి కోసేటి
మాయక్కలారా
తీరిక లేకుంట
సేను కోతలు కోత్తె
తెల్లని సేతులే
నెత్తుర్లు పేరినయి
గవ్వలోలె పొక్కులు

సవ్వడిగ లేసినయ్
పేద తనమంత
పెయిమీద ఉన్నది
తిన తిండిలేదు
తలకు సమరు లేదు
సిల్లుల బట్టల్ల
సితికి పోతున్నాము
మీకన్న గా గడ్డి
పోసలే నయమాయె
పచ్చటి ముసుగేసి
పువ్వులే పూసినయ్ ॥సినుకువాన॥

బంట తట్టలు మోసె
మా యక్కలారా
అరసేతి మందాన
నెత్తి కాయలుగాసే
ఆడిపోయే మొఖం
ఎండిపోయే జుట్టు
మీ కండ్ల కొలుకుల్ల
కన్నీరు ఏమక్క
మీకన్న గా గడ్డి
పోసలే నయమాయె
పచ్చటి ముసుగేసి
పువ్వులే పూసినయ్ ॥సినుకు॥

దుక్కులు దున్నేటి
మా యన్నలారా
బెడ్డ బెడ్డకు మీది
నెత్తురెంత గారే
సాలు సాలున మీది
సెమట ఎంత పారే
సీకు బట్టిన సెత్త
సినిగి తడుకయిపాయె
ఎండ వానల్లోన
ఎండి నాన బట్టె
రోగాల నొప్పులకు
జల్లెడయ్యి పోయింది
మంచాన బడ్డపుడు
నీకు దిక్కెవరన్న
మీకన్న గాపంట
సేనులే నయమాయె
కడుపునిండ పంట
కప్పుకొని ఉన్నాయి ॥సినుకు॥

పటేలు సేండ్లల్ల
పనిజేసె అన్న
పచ్చగ బెరిగిన
పాటేలు సేనుల
మొక్క మొక్కకు ఎన్ని
సెమట సుక్కలు రాలే
సలి కాలము వచ్చె
మనుసు కురువబట్టె
సల్లటి ఈదర్ల
కావలున్న అన్న
నాత్తిరంతా గూడ
కునుకుదీయలేదు
మీకన్న గాసేండ్ల
జిట్టిబొమ్మనయం
పెయినిండ అంగీలు
ఒంటినిండ బట్ట ॥సినుకు॥

సిన్న లేగలగాసే
మాసిట్టి తమ్ముడా
పాడిబర్లను గాసే
మాపేద తమ్ముడా
ముక్కుపొంట నీకు
సీమిడన్నా బోలే
కండ్లపొంటి నీకు
బూసులన్నా పోలే
ఆరేండ్లు నీకింక

నిండనన్నా లేదు
ఆడుకునే ఈడు
ఆవులను మేపాలే
సదువుకునే ఈడున
లేగలను మేపాలే
అ, ఆలు దిద్దేటి
నీసిన్న సేతులు
అడివిల తుప్పల్ల
ఒరుసు కుంటున్నాయి
నీకన్న గాలేగ
దూడలే నయమాయె
గుమ్మపాలుదాగి
సెంగలిత్తన్నాయి ॥సినుకు॥

ఎన్ని మాటలు జెప్ప
తరుగునే మనబాధ
ఎన్ని తిప్లనుకున్న
ఒడువదే మన కత
గడ్డిపోసల తీరు
కలిసి బతుకుదాము
లేగ దూడలతీరు
కూడి బతుకుదాము
మనకడ్డమెవలున్న
కొడవండ్లు గొడ్డండ్లు
మనసేతులున్నయ్
అట్టగట్టిన సేతులు
ఆయుధాలయినయే
కూలిరాజ్యం కొరకు
కలిసి పోరాడుదాము
పంటసేన్ల తీరు
పకపకా నవ్వేము ॥సినుకు॥

---

## మంటలు

**అల్లం నారాయణ**

జగిత్యాల మండుతంది పిల్లా!
భూస్వాముల గుండెలల్ల మల్లా! మల్లా! ॥జగి॥

షకల్ల వీరప్రజలు
తుపాకుల కెదురునిల్చి
కావలికుక్కల తరిమి
బుద్ధిబాగ చెప్పిండ్రు
అవీర పుత్రులకు
జేజేలు చెప్పుదాము ॥జగి॥

మద్దునూరి దొరోడు
మట్టిగలిసి పోయిండు
ఊళ్ళె ఉన్నోల్లందరు
కోపుగొట్టి గొర్లుపంచిరి
ఎట్టినాగలి జమానకు
ఎదురుతిరిగి నిలబడ్డరు ॥జగి॥

అయోధ్య భూమిపుత్రు
దొరలది పట్వార్లదికాదు
ఎనుకటి జమానకాదు
దున్నెటోనికే హక్కని
తిరుగబడ్డ అన్నలకు
విప్లవాల జేజేలు ॥జగి॥

పోశెట్టిని కన్నగడ్డ
వీర కన్నపురం ప్రజలు
ఏడాదే దాటింది
ఊళ్ళెదొరను ఎల్లగొట్టి
పోరాటం కేంద్రంగా
ఊపిరిచ్చిన అన్నగాళ్ళు ॥జగి॥

మల్లన్న పేటలోన
మాదిగోళ్ళ మాలోల్లు

తిరగబడి దెబ్బతిని
గర్జించే పులులైరి
తమరక్తపు వాటాకు
తిరిగి సిద్ధమౌతున్నరు ॥జగి॥

బిల్వ కోడూరు
చిన్నన్నలు-
బీదన్నలు పేదన్నలు
జమగూడి ఒక్కటయ్యి
ఎదురుతిరిగి నిలబడి
తరతరాల తమబాకిని
తన్ని తీసుకున్నారు ॥జగి॥

రాపల్లె రైతుకూలి
రాజ్యం కావాలని
ఒక్కటై కట్టుగై
సంఘంలో చేరింద్రు
ఊళ్ళెనుంచి దొరోన్ని
పట్నానికి పంపినారు ॥జగి॥

గొల్లపల్లె గుండెపడుగు
ఒక్కటై నిల్చింద్రు
సంఘపోల్ల నీడకింద
కూలిసాల దనుకున్నరు
సమ్మెచేసి కుమ్మక్కై
కూలిరేటు సాధించిరి ॥జగి॥

ఒక్కొక్క ఊరుచూస్తే
మండుతున్న కారడవి
ఆరిపోని కుంపట్ల
చెదిరిపోని ఎలుగురవ్వలు
పల్లెల్లో అధికారం
బీదబిక్క గుంజుకొనిరి ॥జగి॥

తెలంగాణ పోరాటం
వారసత్వ వీరప్రజలు
తుదివిజయం సాధించే
వెలుగుతోటి నిశ్చయంగా
కదంతొక్క పాటపాడి
ఉప్పెనవలె కదులుతంద్రు ॥జగి॥

(అంకితం : అరెస్టులు, కాల్పుల మధ్య మొక్కవోని పోరాట దీక్షతో పోరాడుతున్న కరీంనగర్, ఆదిలాబాద్ వీర ప్రజానీకానికి-)

---

(లొత్తునూరు భూస్వామి సాగర్‌రావు పోలీసులతో కుమ్మక్కయి రైతాంగంపై కాల్పులు జరిపి పల్లెలో భీభత్సం సృష్టించినపుడు, భర్త కొండల్లోకిపోగా, బతుకు బరువుకాగా దిగులుపడి, పల్లె విడిచి పోయేందుకు గోదావరి దాటుతోన్న చెల్లెల్ని సంబోధిస్తో-)

## గంగ దాటెళ్ళకే చెల్లెమ్మా!

శివసాగర్

గంగదాటెలిపోకుమె చెల్లెమ్మా!
కంటనీరెడతావు ఏలమ్మా!

చినమెట్టు పల్లెలో
దోపిడీ దొరగాడు
రైతు కూలీలపై
తుపాకి గురిపెట్టి
శివయ్యబాపును
గాయపరిచాడని

కలత చెందకు నీవు చెల్లెమ్మా!
కసితీర్చుకుందామె చెల్లెమ్మా!
సంఘమున్నది మనకు చెల్లెమ్మా! ॥గంగ॥

లొత్తునూరులోన
పోశాలు మామయ్య
పోలీసు కాల్పుల్లో
ప్రాణమిచ్చాడని
దిగులు చెందకునీవు చెల్లెమ్మా!
ధైర్యంగ ఉండాలె చెల్లెమ్మా!

పారిపోయిన దొరలు
పోలీసు మూకలతో
పల్లెలకు తిరిగొచ్చి
పడగలే యిప్పిన్రు
మీసాలు మెలివేసి
రోషాలు పోతుండ్రు

ఈరోజులెన్నాళ్ళు చెల్లెమ్మా!
మన రోజులొస్తాయి నిజమమ్మా!

వెట్టిచాకిరిచేసి
మట్టికలిసే బతుకు
దండుగలు చెల్లించి
దండుగయ్యె బతుకు
దొరల గాదెలునింపి
దొరలిపోయె బతుకు

ఈబతుకు మనకొద్దు చెల్లెమ్మా!
ఈవెతలు తీరాలె చెల్లెమ్మా!

దున్నెవానికి భూమి
దక్కేటంతా వరకు
దోపిడీరాజ్యాన్ని
పాతం పట్టేవరకు
రైతుకూలి రాజ్య
మొచ్చేటంతా వరకు

కలిసి కట్టుగ మనము చెల్లెమ్మా!
నిలిచి పోరాడాలె చెల్లెమ్మా!

ఎర్రజండా మనకు
అండగా వున్నది
సంఘ బలమే మనకు
బాసటగ ఉన్నాది
పోరాటమొక్కటే చెల్లెమ్మా!
మన బతుకు బాటనే చెల్లెమ్మా!

ఉప్పుమడిగలోన
ఉప్పెనే లేచింది
మద్దునూరులోన
మంటలే లేచాయి
జగిత్యాల కొండల్లో
జ్వాలలే నిలిచాయి

పిడికిళ్ళు బిగియించి చెల్లెమ్మా!
పరవళ్ళు తొక్కాలి చెల్లెమ్మా!
గంగదాటెళ్ళకే చెల్లెమ్మా!
కంటనీరెట్టకే చెల్లెమ్మా!
కట్టుగా ఉండాలె చెల్లెమ్మా!
కాంతులే పండాలి చెల్లెమ్మా!
పల్లెంత యెన్నెలై చెల్లెమ్మా!
పగలబడి నవ్వాలె చెల్లెమ్మా!

## పోరాడే రైతులారా!

హెచ్చార్కె

[ట్యూన్: లాల్ సలామ్ లాల్ సలామ్
సలామ్ సలామ్ లాల్ సలామ్
పాట వరుసలో]

అదురకండి బెదురకండి
పోరాదే రైతులారా
పోరాదే రైతులారా!
చెదురకుండ నిలవండి
జనంపోరు గెలిచితీరు
జనంపోరు గెలిచితీరు ॥అదుర॥

కరీంనగరు, అదిలబాదు
రణభూమిగ మారెరా
నక్సల్బరీ శ్రీకాకుళ
గోదావరి యోధులారా ॥అదురకండి॥

భూస్వాముల దౌర్జన్యం
చెల్లదంటు లేవండి
పోలీసుల కాల్పులకు
పోరాటమె జవాబు ॥అదురకండి॥

అణిగి మణిగి వుండినాము
తాతతండ్రి కాలమంతా
బాంచెనంటు మొక్కుకుంటు
ఒదిగి ఒదిగి బతికినాము ॥అదురకండి॥

ఎర్రజెండ నీడకింద
ఐక్యంగా కలిసిపోయి
మనసంగమె మనశక్తిగ
పిడికిలివలె ఎదిరిద్దాం ॥అదురకండి॥

కష్టజీవి చెమటచుక్క
పొద్దుపొడుపు వేగుచుక్క
కష్టజీవి కదిలిందా
విరుగును దోపిడికొండ ॥అదురకండి॥

ఒకటి, రెండు, వంద, వేలు
లక్షలాది మనబలగం
భూమితల్లి బిడ్డలారా
శ్రమజీవిదె తుది విజయం ॥అదురకండి॥

ప్రజాస్వామ్య వాదులంత
మనపక్షమె నిలుస్తారు
భరతదేశమంత ప్రజలు
మనబాటనె నడుస్తారు ॥అదురకండి॥

(కరీంనగర్, అదిలాబాద్ జిల్లాల్లో భూస్వామ్యవ్యతిరేక రైతాంగపోరాటాలవుత్తేజంతో)

---

ఓటి పాటలు – సేకరణ : అల్లం రాజయ్య

1

వీరులంరో! శూరులంరో!
పోరాట మధికారులంరో!
రణధీరులంరో!
ప్రతిపనికి మేమురా
పటేండ్లు ఏందిరా
పట్వారి ఏందిరో ॥వీరు॥

పోలీసు పటేలునంటాడు
సూర్లకొద్ది తింటాడు
పట్వారి నంటాడు
పరంబోగు సూపడాడు
తాసీలు గట్టుమని
తైతెక్క లాడుతాడు
రేపుగడుత బాంచెనంటె
సుంకరోన్ని దోలిచ్చి
1 తలెమంతలు దెమ్మంటడు ॥వీరు॥

ఓటియ్యమని వాడు
ఇంటింటి కొస్తాడు
భూములత్త యంటాడు
జాగలత్త యంటాడు
కాయిదాల కర్సుకని
ఇంటికి పదిరూపాలు
జమజేసుక పోతాడు ॥వీరు॥

ఓటుమీద ఓటేసి
సర్పంజిని గెలిపిత్తే
సెక్కర సీటియ్యమంటె
అంబలి గాసుకుంటవనె
టీదోల్లను దోసుకొని
బీరు బరండిదాగి
సీటుమీన కూకొని
సికిలెట్లు తాగుతాడు ॥వీరు॥

లంగలాల్లురో!
దొంగలాల్లురో!
మాకండలు కరిగెనని
మానెత్తురు పారెనని

మారాజ్యం వచ్చెదనుక
ఆ [2]బిత్తిరి కొడుకులను
[3] అనికెలిరుగ తన్నుతాము

[ఈ పాట పాడిన వ్యక్తి ఏల్పుల గట్టయ్య- 15-16 సం॥ వయసువాడు- పలకమీద ఉత్సాహంకొద్దీ రాసుకొచ్చాడు- తీరా చూస్తే పలుకలో ఓనమాలు వున్నాయి.... పాడమని రాసుకొన్నాను.]

1. పళ్ళెము 2. బెదురు 3. పక్క బొక్కలు

## 2

వాని కడుపుడికినాది
వానికండ్లు మండినాయి-
పాలేర్లు రాలేదాని
వాడు పండ్లుగొరికినాడు ॥వాని॥

భూమిలేనివారు
[1] ఎద్దెవుసం లేనివారు
కడుపు తిప్పలకు [2] గోత్రాలోల్లు
కథ మొదలేసుకుంటె
దొంగన్నడు [3] బెగడన్నడు
ఊళ్ళెమంచిగ లేదన్నడు
లంచమియ్య లేదాని
పేరుదలువ లేదాని
కరీము దొరోడు
కఠినమే తలిసిండు
[4] కుట్టర బెట్టుకొని
మీసం దిద్దిండు ॥వాని॥

బుద్దిలేని ముసల్ది
ఓట్లే కంకేసుకుంటె
అద్దుపద్దు లేనిదొర
మాటలెన్నో అంటడు
నీతిలేని దొరోడు
రీతిరీతి బెట్టితిట్టె ॥వాని॥

అయ్యలేని పోరన్ని
[5] దీములేని పోరన్ని
నెల జీతముంచుకొని
జేబుదొంగ వన్నాడు
అవ్వనక్కను దిట్టి
తన్ని సాగదోలిండు ॥వాని॥

[6] కూడులేని కూతురు
జీత మడిగిందాని
కొండెంగ మొఖపోడు
కొట్టనే కొట్టిండు-
అరె! అయ్యదిక్కు ఉండేదుంటే
వాడుగట్ల దిట్టునా!
వాడుగట్ల గొట్టునా!
వాడు నిదురబోవునా!
వాని ఇజ్జతుండునా!
పుండకోరు సినపెద్దులు
సెవులా లేసిఇన్నడు-
మాటదోయని లింగన్న
మల్ల మాట్లాడనేలేదు-
కులానికి సెప్పుకుంటే-
గుడ్లల్ల నీల్లను
గుడ్లల్ల కుక్కుకుంటి ॥వాని॥

అన్నలచ్చినంక-
ఆళ్ల ఇలవరిసె బెట్టినంక
ఆడేమి సేత్తడో
సూడనే సూత్తా.... ॥వాని॥

[ఈ పాట చదువురాని 13-14 సం॥ బాలుడు- పేరు సమ్మయ్య- పాడి వినిపించాడు.]

1. ఎడ్లు వ్యవసాయం 2. మున్నూరి కాపువాళ్ళను అడుక్కొని కథలు చెప్పుతూ జీవిస్తుంటారు 3. భయం 4. కుట్ర 5. దిక్కు 6. వాడి తల్లి విధవ

## 1

ఒక దొర (భూస్వామి) దగ్గర జీతమున్న ఇద్దరన్నదమ్ముల్లో ఒకడు ఒక రోజు జ్వరం వచ్చి పనికిపోలేదు- అన్నెందుకు పనికి రాలేదని అడిగితే జరమొచ్చిం దయ్యా అని తమ్ముడు మొరపెట్టుకున్నాడు- అయినా పనికి రాలేదని అతన్ని ఇంటికి పట్టి తెప్పించి ఒక మొగురానికి (గుంజ) కట్టేయించి శరీరమంతా నెత్తుర్లు కారంగ కొట్టాడు- ఏడ్పులు, పెడబొబ్బలతో ఆ యువకుడు సొమ్మసిల్లాడు అతని కట్లపై చల్ల నీళ్ళు పోయించి దొర లోపలికి వెళ్ళి నిద్ర పోయాడు- తడివల్ల ఆ కట్లు బిగుసుక పోయి ఒంటి నిండా అయిన గాయాలకు ఒరుచుకపోయి ఒళ్ళంతా మంటలు మంటలు. అర్ధ రాత్రి పన్నెండు గంటలయింది- ఆ మంటలకు తాళ లేక ఆ జీతగాడు పెడ బొబ్బలు పెట్టిండు.

దొర తండ్రి పెద్దొరకు నిద్రాభంగమయింది- జీతగాడు పెడబొబ్బలు పెట్టి తనకు నిద్ర చెడగొట్టాడనే కోపంతో వచ్చి తానూ ఎడాపెడా కొట్టిండు- అట్లా అయితే తన అన్న ఇంక బతకలేడని ధైర్యంచేసి అతని తమ్ముడు కట్లు విప్పి వెళ్ళగొట్టిండు- ఆ వూళ్ళోవుంటే ఇంక దొర బతకనివ్వడని వాళ్ళు ఊరిడిచి వెళ్ళిపోయారు. తెల్లవారి నా కొడుకులేరని తండ్రి అడుగబోతే, కొడుకులను జీతముండకుండా సంఘంల కలిపి అడుగొచ్చినావురా? అని తిడుతూ దొర అతన్ని తన్నబోయిండు- పోలీసు స్టేషన్‌లో చెప్పుకోడానికి పోతే, దొరకు జీతముండకుండా పోతార్రా లమ్డీ కొడుకుల్లారా! అని పోలీసులు కూడ బూతులు తిడుతూ కొట్టకొట్ట వచ్చిర్రు.

ఊరిడిచి వెళ్ళిన జీతగాణ్ణి కొందరు యువకులు జిల్లా ఉన్నతాధికారి దగ్గరకు తీసుకవెళ్ళి గాయాలు చూపి దొర దౌర్జన్యం గురించి చెప్పిర్రు- ఇంకా ఆదర్శాలు చావని యువ ప్రాయంలో వున్న అధికారి దొరమీద కేసుపెట్టి దొరను అరెస్టు చేయించిండు- ఆ అధికారి జీతగాండ్లతో సమ్మెలు చేయిస్తున్నాడని ఆ ప్రాంతం ఎమ్మెల్యే పైనచేసిన షికాయత్‌వల్ల బదిలీ అయిపోయాడు- దొరకు బెయిలు వచ్చింది తరువాత కేసూ పోయింది- ఊరుచేరి దొరతనమూ పెత్తనమూ యధావిధిగా చెలాయిస్తున్నాడు.

[రాడికల్ యువజన సంఘం వరంగల్ 21-9-78 న వేసిన కరపత్రం ఆధారంగా- ఈ సంఘటన వరంగల్ తాలూకా ఒక గ్రామంలో జరిగినట్లు ఆ కరపత్రంలో వుంది.]

## 2

ఒక గ్రామంలో అధికారంలోవున్న ఒక 'సమతా' పార్టీ వాళ్ళు ఇద్దరు యువకులను నెత్తుర్లు కక్కేటట్లు కొట్టారు- చికిత్స కోసం ఆసుపత్రికి పోకుండా, చెప్పుకోవడానికి పోలీసు స్టేషనుకు పోకుండా రెండుమూడు రోజులు కాపలా కాసారు.

వాళ్ళేం నేరం చేసారని ఈ శిక్ష: వాళ్ళు నేరాన్ని ప్రశ్నించారు- అధికారంలో వున్న 'సమతా' సర్పంచ్ చేసిన నేరాన్ని ప్రశ్నించారు.

ఒక లంబాడీ పేదరైతు భూమి 2ఎకరాలు ఒక వ్యక్తిదగ్గర కుదువబడి వున్నది- ఆ భూమి విడిపించి ఇస్తానని సర్పంచు ఆ లంబాడీ దగ్గర డబ్బు తీసుకొని విడిపించి అతని భూమి అతనికి ఒప్పచెప్పకుండా తానే అనుభవిస్తున్నాడు- ఆ వూళ్ళోనే ఇంకా ఇతర లంబాడీలకు వడ్డు యిచ్చి, కల్లు పోయించి 15 ఎకరాల భూమి కాజేసాడు ఈ సమతా పార్టీ సర్పంచు. ఒక లంబాడీ 12 కుంచాల వేరుశనగ బాకీ వుంటే ఆ బాకీ కింద అతని 20 గుంటల భూమి స్వాధీనం చేసుకున్నాడు- 12 కుంచాల కాయ యిచ్చి 18 కుంచాలు యిచ్చానని దానికి 160 రూపాయలు ఖరీదన్నాడు- 50 రూపాయలు యిచ్చి 110 రూపాయలు ఇచ్చినట్లుగా లెక్క చూపాడు- ఇదంతా ఎందుకు నీ పైసలు నీకు ఇస్తాను నా భూమి నాకివ్వమంటె 'ఇన్ని రోజుల నుంచి నేనే దున్నుకున్న కాబట్టి ఈ భూమి నాదే' నని ఆ లంబాడీని పశువుల దొడ్డిలోకి తీసుకవెళ్ళి కట్టేసి నోటిలో పెండబెట్టి కొట్టాడు ఈ సమతా సర్పంచు.

ఇదేం న్యాయమని గద్దించారు ఆ యిద్దరు యువకులు. ధిక్కారాన్ని సహించని సమతా సర్పంచు వాళ్ళమీద దొంగకేసులు పెట్టించి పోలీసులకు పట్టించాడు- పోలీసులకు ఆ యువకుల దగ్గర విప్లవ సాహిత్యం దొరికింది- ఇంకేం కావాలి: ఆరురోజులు పోలీసు స్టేషన్‌లో పెట్టి విపరీతంగా కొట్టారు.

విడుదలయి వచ్చాకా పోలీసులు వేసిన శిక్ష సరిపోలేదని భావించిన సమతా సర్పంచు ఆ ఇద్దరి యువకులకు పైన చెప్పిన శిక్ష విధించి రెండు మూడు రోజులు గృహ నిర్బంధంలో వుంచాడు.

[రాడికల్ యువజన సంఘం వరంగల్ 22-9-78న వేసిన కరపత్రం ఆధారంగా.]

# "మా లోని వాడివే..."

రాయేశం

"యేమైందొవాయీ, పెయ్యన్ని దెబ్బలేను" పోలీసు కామయ్యబావ వరుస వున్న యారేశంతోటన్నడు.

"యేఁవున్నదోయ్! నీయక్క మొన్న ఆ పాలి టెకినిక్కుకాడ అయినోన్ని కానోన్ని ఇంట్లోన్ని బైటోన్ని అనకుంట ఒకటే సంపుడుపెడ్తిరి మీపోలీసులు- గప్పుడేనేను దేవునిగుడికి పోతానవాయి- దేవుడేమోగాని దెబ్బలైతె పెయినింద సందులేకుంట గొట్టిన్రు- యేదోయింత మందేయించుకొని సూద్దీసుకుంటామని ఇటచ్చిన" యంజియం దావకాన్ల అడిగిన పోలీసు కామయ్యకు సంగతంత చెప్పుకచ్చిండు యారేశం.

"నువ్వోపిచ్చోనివి- గీ గాంధావకాన్ల సూదిమందు కచ్చినవుగని వట్టిసిల్లేగాదు బా! మల్లమంచిగ లైనంత అక్కడుండంగ నువ్వేమొ ఇవుతల్నిల్సున్నవు-" పో-కా.

"అలైన్లన్ని తిర్గాల్నంటె నా వున్నపానం పుటుక్కుమంటది- చిట్టిరాసెకాడ డాక్టరు సూసెకాడలైన్ల పావుల పావులిచ్చి పోరగాండ్ల నిలబెట్న- ఇగ సూద్దీసుకోవాలె కొద్దిగ ముంగట పడెయ్యరాదునన్ను" యా.

"మరి నాపావులేది?" నవుకుంట తీస్కపోవుకుంట పో-కా.

"నీజాతిబుద్ది బోనిచ్చినవుగాదు- పా పా!" యా.

సూద్దీసుకొని నల్సుకుంట బైటికచ్చిండు యారేశం- "చాయన్న తాగిచ్చేదున్నదా లేదా!" పో-కా. అనంగనె- "సరెపా" అనుకుంట వోటర్లకు బొయింద్రు.

"పొద్దుగాల్లేత్తెనె నీయక్క! అదేంది- దొంగల్ దొంగలు వూర్లు బంచుకున్నట్టుగ- వోటర్లకెల్లి పున్యానికి దొబ్బతింటిరి- పల్లికాయ బండి, గారెలబండి కాన్నుంచి పండ్లదుకానాల్దాక? అహఁ గిన్నితీర్ల! యింక మర్శపేయిన గ బస్సులదిగిన పోరగాండ్లు గూడ! యీ సంపాదనంతా యేంజేత్తానట్టు- మల్ల యింటికాడజూత్తె పోరగాండ్లకు వొక్కఅంగిపేగు మంచిగలేదు- గవ్వే మసిపంత పేగులు- గవ్వేచిప్పలు" మంచి చెడ్డ అర్సుకుంట అన్నడు యా.

"యేందో బా! యీనౌకరే గసోంటిది- దరిద్రపునౌకరి. బర్కత్ లేదు- తాగుడుకు ఆటకే అయిపాయె- గక్కడమాత్రం మాఅటలాగయి- యెక్కువమాట్లాడ్తె బట్టలు యిడిశి తంతరు" నవ్విండు- టోపితీసి టేబిలుమీదపెట్టి ఓసారి చెయితోటి నెత్తినిదువ్విండు. మల్లజెప్పుకచ్చిండు "నౌకరిముచ్చెట కచ్చేటాల్లకు బా! కానబాదని పిస్తది- పొద్దుగాల పొద్దుగాల్నె యస్సైతోనితిట్లు "యేమైందిబే, నిన్నరాలేదు. ఇక్కడ

నీయవ్వమిందెడు జేత్తడనుకున్నవ నౌకరి, ఇంక తెల్లార్లేద్, గిప్పుడా బె డూటీకత్తె పైఁమెం తైంది- ఆరండ్లుజూడు- బూసుకండ్లు పాశిమొకం, మొకం కడుగలేద్ బె, ఇప్పుడె పెండ్లాం పక్కలకెల్లి లేశత్తానవా?" నిజంగగూడ నేన్దాని మంచంకాన్నుచే పొయిన- అదిపెద్ద జెరంవచ్చి తల్లడిస్తాంది. పొల్లగాండ్లకు గిన్నన్ని నూకలుడకబెట్టి, దబదబ గిన్నెన్నినీల్లు మొకంమీద్జల్లుకొని యేగిర పడుకుంటనె పొయిన- అరెరెరె ఒకపేతిట్లు- నేనింక నోట్లెపంచిల్లు బొయ్యకుంట, ఆడికె పైపైపోతాందనిపురక్కనే పురికిన- అండ్లరాత్తిరిలి ఇంటికి బొయ్యేటాలకు అది మంచాలున్నది. పొలగాండ్లు తలో దిక్కు డొక్కలీడ్సకపొయ్ కూరపేగులోలె పడున్నరు. నాకంత చికాకనిపిచ్చి నేగ్గూడ సప్పుడుజేకనెవన్న. పొద్దుగాల పోంగనె లిట్లాయె- "అఁ చలో లైన్కదో లైన్కదో" అనేటాల్లకు నాకుపానవంత సొదసొదలు పోవట్టింది. సరింగ నిలబదరాక పేయింది- యస్సైగాడొచ్చి "క్యంబె, యేమొ వూగుతన్నవ్ బోంగదానోలె, సక్కగ నిలబడ్" అన్నడు-" అని యింకేమొ చెప్పబోతాంటె యాదేశం చాగిలాన అడబెట్టి తొడంత కొట్టుకుంట నవ్వుకుంట "నిజంగగూడ పోలీసోల్లంటె బోగందాన్తోటి సమానమె- యేందెల్వకున్న యెవ్వదెక్కువ మీటితె...." సవ్వాష్కుంట సప్పుల్లె అన్నడు.

"గంతె బా! నిజంగగూడ సూత్తాంటె మన్సుకు జీట్టబుట్టుకస్తుంది- గానడుమ మీపక్క సుకుర్గాన్తోని అనుంటి- "అదిగాడ్ బై! మొన్నగావూరి పొల్లగాన్ని దీస్కచ్చి గట్లకొట్టి సంపుతాంద్రి- వాడేం జేసిండు- అరె కూలివాయిగాల్లతోన్జేరిండు, కూటి కోసం కొట్లాడ్తాంద్రు నడుమ మనకేంది? మనం యిచ్చేటోల్లమా, తీస్కనేటోల్లమా దొరచ్చి కల్సిపోవుడేంది, పొల్లగాన్ని గట్లకాల్సుక తినుడేంది?" అని- యాదేశం యిచ్చిన సిగిలేటు అంటుబెట్కోని ఓదమ్ముదీర్సి "అంటె వాడంటడుగద!" "తుత్తెరికి, నువ్గూడ ఆకలి గరీబి ఉప్తానవ్! అరె దివానా! మనఅమ్మ చెప్పలేదుర, గీ ఆకలి కడుపులు యిశారించే, మనదేశంల ఆకలి కడుపులు లేకుంట జేసెయ్యంద్రన్నది- గిది గూడ దెల్వద్నీకు- గరీబీ అటావో అంటె అర్తమేంది? గరీబెత్తం తీసేత్తె బోయె టాన్కి బెండా, నూకేత్తె బొయెటాన్కి గుండా- గిబెట్లె! గరీబోల్లను బూమ్మీద లేకుంటజేత్తె అయిపాయె" అన్నడు- నిజంగ బా! నవులాటగాదు- గిసోంటి ముచ్చట్లు జరుగుతాంటె పెయ్యన్ని ముండ్లత్తయ్, గని యేంజెయ్యాలె" బోపినితీసుకొని మల్లొక సారి దుమ్ము దులిపినట్టుగ దులిపి పెట్టుకున్నడుపో-కా.

"యెట్లయిన మీ రాజ్జెమెపోయింది- అ పాలిటెకినిక్కు లోపలికిబోయి పొల గాల్లను బొట్టగాల్లను కొట్టుడేందో. పల్లాడ యునివర్సిటిల పెద్దపెద్ద సదువులు సదువ

# గ్రామీణ పేదల చైతన్యానికి పునాది 'భూమి' సమస్య

[చల్లపెల్లి రాజా స్వాధీనంలోవున్న మూడువేల ఎకరాల భూమిని పంచదారమిల్లు పేరుతో పరిశ్రమలకు ఉపయోగ పడుతున్న భూమిగా చిత్రించి 'భూ సంస్కరణల' పరిమితిలోకి రాకుండా కాపాడవలసిందిగా ముఖ్యమంత్రి చెన్నారెడ్డిగారికి ప్రధాన మంత్రి మొరార్జీ దేశాయ్ రాసిన ఉత్తరాల ప్రస్తావన పత్రికల్లో చాల మందిని ఆకర్షించింది. భూస్వామ్య విధానము, పెట్టుబడిదారీ విధానమూ పెనవేసుకొని ప్రభుత్వాన్ని తమ కెట్లా కావలి కుక్కలుగా వాడుకుంటున్నాయో ఈ నిదర్శనం చాలు. సమస్యలన్నీ భూమి చుట్టే తిరుగుతున్నాయి కనుక పోరాటమూ భూమి కేంద్రంగా జరగాల్సిందేననే అవగాహన కోసం ఈ కింది సమాచారం.]

"ప్రజల మనిషి" నవలలో ప్రజాచైతన్యానికి భూమిసమస్య పునాదిగా ఎలా పనిచేసిందో వరవరరావుగారు 'సృజన' పత్రికలో తెలియపర్చిన అంశాలు చాలాబాగున్నాయి. భూమిసమస్య ప్రజల్ని ఎలా చైతన్యవంతుల్ని చేయగలదో ఇటీవలే నేను చూసిన ఒకగ్రామంలోని విషయాన్ని వివరిస్తాను.

దివితాలూకా అవనిగడ్డకు మూడుమైళ్ళ దూరంలో కృష్ణానదిపాయకు దక్షిణంగా 3 వందల జనాభాగల పడుగువారిపాలెం అనే గ్రామముంది. దీన్ని, ఇంకో రెండు చిన్న గ్రామాల్ని కలిపి దక్షిణ చిరువోలులంక అంటారు. గ్రామంలోని వారందరు పేదపల్లెకారులే (మత్స్య పారిశ్రామికులు) వారిగ్రామానికి, కృష్ణానదికి మధ్యనున్న 50 ఎకరాల లంకభూమిని బ్రిటిష్ ప్రభుత్వము వారిచ్చిన లీజులో 37 సం॥ ములు సాగుచేసి అనుభవించారు. కాని ఈభూమితనదని వేలఎకరాల అధిపతిగావున్న చల్లపల్లి జమిందారు 1957లో బలవంతంగా పోలీసు రెవెన్యూ అధికారుల సహాయంతో ఆక్రమించుకున్నాడు. ప్రజలు మిలిటెంటుగానే కొంతకాలం పోరాడినా అనేక బలహీనతలవల్ల భూమిని నిల

---

కునేటోల్లు, మంచిగ మనదేశంల ఎలక్సన్లో ఎలెక్సన్లని పెజాసామ్యమని చెప్పినతీర్ల వాల్లు ఎలక్సెన్‌లు జరుపుకుంటాంటె గాడగూడ మేమేవని పోవుడేందో? ఇగమంచేది, చెడ్డేది? దర్మంచెప్పు దర్మరాజ అంటె దుడ్డెబఱ్ఱె నాదేనన్నట్లున్నది మీ పోలీసోల్లకత. యేమొ యెవడెక్కడబోతె నాకేంది. మల్లికియెల్లి యెల్లికిమల్లిని బట్టిచ్చి యేందో యేందోజేత్తరు. అబ్బో మీపోలీసోల్లతోని పెట్టుకోవద్దుర దేవుడో" అనుకుంట లేసుకుంట "అదిసరెగాని మరి నీకొడుకేమొ గా ఎఱ్రజెండాలోల్లతోని." అని అంటాంటె పో-కా. చెప్పిన యీరేశంమాటికి చెయ్యి అడ్డంపెట్టిండు. దబదబ ముంగలచ్చి చావిల్లుకట్టిండు. నమస్తంటె నమస్తె అనుకుంట చెరొదిక్కు పొయిన్రు.

బెట్టుకోలేక పోయారు కోర్టులు తాలూకాఫీసులు పాలక పార్టీలచుట్టు తిరిగినా వేల రూపాయల ఖర్చుతప్ప ఫలితము దక్కలేదు.

జమిందారు ప్రజలకు వ్యతిరేకంగా సాగుచేయలేక భూములు అమ్మకానికి పెడితే ఎవరు కొనవద్దని ఆనాటి కమ్యూనిస్టుపార్టీ నిర్ణయం చేయటంతో ఆభూములు కొనటానికి ఎవరూ ముందుకురాలేదు. కొంతమంది కోసూరుపాలెం భూస్వాములు జమిందారునుండి కేవలం ఎకరం 1000 రూ॥న అక్రమంగా కొన్నారు. ఆనాటినుండి వడుగువారి పాలెంనుండి రేవుకిఉన్న డొంకమీద గొడ్లని మనుషుల్ని నడవనీయకుండ కనీసం ఎవరయినా చనిపోతే రేవువద్దున శవదహనం జరగటానికికూడా స్థలంలేకుండా చేసారు. తాలూకా కేంద్రానికి 3మైళ్ళ దూరంలోనేఉన్నా ఆ గ్రామంనుండి బయటకు వెళ్ళటానికి కనీసము కాలిబాటకూడాలేదు.

వారు తల్లిపాలు తాగటానికి నోచుకోని పిల్లల్లాగా తమస్వంత భూములలో తామే కూలీలుగా మారిపోయారు.

ఈమధ్యకాలంలో ఒకతరం మారింది. గ్రామంలో అనేక ముఠాలుగాచీలి ఒకరికొకరికి పడనిపరిస్థితి ఏర్పడింది. ఇదంతా దేశంలో పెరుగుతున్న దోపిడీ సంస్కృతికున్న రాజకీయ ఫలితమే.

స్థానిక 'గ్రామీణ పేదల' సంఘ అభిమానులు ప్రజల్ని కూడగట్టే ప్రయత్నాలు చేస్తున్నప్పటికి, ప్రజలలోవున్న చీలికలు, పెత్తందార్ల ముఠాపద్ధతులు ప్రజల్ని కలవ నివ్వలేదు. ఒకటి రెండు చిన్నసమస్యలమీద వీరుకదలి పనిచేసి యువకులలో నిదానంగ ఆలోచన రేకెత్తించ గలిగారు.

గత జూన్‌నెలలో రేపల్లె తాలూకాలో చల్లపల్లి జమిందారు లంకభూములను అక్కడి ప్రజలు 280 ఎకరాలను ఆక్రమించిన సంఘటనపై వేసిన కరపత్రం వడుగు వారిపాలెం యువకుల్ని తీవ్రంగ ఆలోచింపజేసింది. ఆలోచన ఆచరణకు దారితీసింది. గ్రామంలోవున్న మొత్తంయువకులు సమావేశమైనారు, తమతండ్రులు, తాతలు కష్టము చేసి అనుభవించిన లంకలలో ఇపుడు తాము కూలీలుగా మారిన దుస్థితినుండి ఎలాబయట పడాలిఅని సుదీర్ఘముగా చర్చించారు. లంకలను మళ్ళీసాధించాలి అందుకు గ్రామస్తు లందర్నీ ఐక్యంచేసి తరువాత భూములను ఆక్రమించుకోవాలి అని నిర్ణయించు కున్నారు. ఇంటింటికి తిరిగారు, భూమికోసం అందరు ఐక్యంకావాలని చెప్పారు. అందర్నీ సమా వేశ పర్చారు- కోర్టులు, తాలూకాలు చుట్టు తిరిగితే భూమి రాదు- భూమి సమస్య

భూమి మీదనే పరిష్కారం చేసుకోవాలి- అనేక కష్టాలు ఇబ్బందులు వస్తాయి- అయినను సరే అందుకు సిద్ధం కావాలి- భూమి లాక్రమించే కార్యక్రమాన్ని మినహాయించే ఏ కార్యక్రమాన్ని ఎవరిచ్చినా తిరస్కరిద్దాం, భూమి లాక్రమణను ఎవరు సమర్థించినా అందుకు ఎవరు సహాయపడినా స్వీకరిద్దామనే నిర్ణయంతో, గ్రామస్థులు 28-8-78 నాడు భూముల్లోకి వెళ్ళారు- 'గ్రామీణ పేదల సంఘం' నాయకత్వాన ఇదంతా నడిచింది.

ప్రజలు ఐకమత్యంగా పోరాట దీక్షతో భూమి లాక్రమించే సరికి భూస్వాములు భూముల్లోకి రాముగా రావటానికి జంకారు. పేద ప్రజల పశువులు స్వేచ్ఛగా మేత మేసుకొంటున్నాయి- పురుషులందరు ఉదయం సాయంత్రం కర్రలు భుజానపెట్టుకొని 'గ్రామీణ పేదల ఐక్యత వర్ధిల్లాలి' 'లంక భూమిని సాధిస్తాం' 'మృత వీరుల ఆశయాల్ని సాధిస్తాం' అని నినాదాలిస్తూ తమ భూముల చుట్టు ఊరేగింపు చేస్తున్నారు- సాయంత్రం ఊరేగింపులో స్త్రీలు కూడ పాల్గొంటున్నారు.

మధ్యాహ్నం పోరాట పాటలు పాడుకోవటం, విప్లవ కథలు వ్యాసాలు కరపత్రాలు చదివించుకోవటం ప్రతిరోజు రాత్రి సమావేశము జరుపుకొని, మరుసటిరోజు కార్యక్రమాన్ని నిర్ణయించుకోవటం చేస్తున్నారు- యువకులు పాటలు నేర్చుకొని పాడటం ప్రజల్ని సమీకరించటం తమ పోరాటానికి సంబంధించిన కరపత్రాలు గ్రామాలవెంట పంచి రావడం, దగ్గర గ్రామాలకు పాటలు పాడుకుంటూ నినాదాలిచ్చుకొంటు తమ పోరాటానికి మద్దతు సంపాదించటం, ఇతర గ్రామాల్లో సమస్యలపై ఆయా గ్రామాల ప్రజల్ని పోరాడమని ప్రచారం చేయటం జరుగుతోంది. భూమి సమస్య కేవలం రైతాంగానికే ప్రయోజనం చేకూర్చటం కాకుండా మన దేశంలోని పీడిత ప్రజలందరికి ఇదే కీలకమైనదిగా ఎలా వున్నదీ అర్థంచేసుకుంటున్నారు.

భూస్వాములు కోర్టులో కేసుపెట్టి ప్రజల్ని పోలీసు స్టేషను చుట్టు తిప్పటానికి ప్రయత్నిస్తున్నారు- దోపిడీ వ్యవస్థను పరిరక్షించటానికి చట్టాలు, పోలీసు రెవెన్యూ డిపార్ట్మెంట్, మొత్తం రాజ్యాంగయంత్రం ఎలా పనిచేస్తోందో, ఈ రాజ్యాంగ యంత్రం వున్నంత కాలం ప్రజల సమస్యలు ఎలా పరిష్కారం కావో అర్థం చేసుకుంటున్నారు.

కేవలం పదిహేడు రోజులలో ప్రజల ఆలోచనల్లో జీవితంలో వచ్చిన మార్పును గమనిస్తే ఎవరో అన్నట్టు "మామూలు పరిస్థితులలో పది సం॥ ములలో వచ్చిన చైతన్యంకంటె విప్లవ పోరాటం జరుగుతుండగా పది రోజులలోనే ప్రజల చైతన్యం

# పోరాటమే సమస్యల పరిష్కారానికి మార్గం

మన భారతదేశం వ్యవసాయకదేశం. నూటికి ఎనభైమంది ప్రజలు భూస్వామ్య అన్నిరకాల ఫ్యూడల్ దోపిడీకి గురిచేయ బడుతున్నారు. మన దేశాభివృద్ధికి భూస్వామ్య వ్యవస్థ అన్నిరూపాలలోనూ ఆటంకంగా తయారైనది. మనది వ్యవసాయక దేశం కావటం భూమి కొద్దిమంది భూస్వాములచేతుల్లో కేంద్రీకరించి వుండటం మూలంగా అత్యధిక ప్రజలు నానాటికీ పేదరికానికి గురవుతున్నారు. ప్రజలలో కొనుగోలు శక్తి క్షీణిస్తోంది. దీనితోదేశం పారిశ్రామికంగా అభివృద్ధి చెందలేకపోతోంది. విదేశీదోపిడీ పెరిగిపోతోంది. ఫలితంగా నిరుద్యోగం ధరలు పెరిగి దేశంతీవ్ర సంక్షోభంలో కూరుకు పోయింది. గ్రామీణ ప్రాంతాలలోనేకాక కార్మికవర్గంలో తీవ్రమైన ఆందోళనలు చెల రేగుతున్నాయి. మధ్యతరగతి ఉద్యోగులు తమవేతనాల పెంపుదల కొరకు సమ్మెలు చేస్తున్నారు. అన్నివర్గాల ప్రజలలో తీవ్రమైన ఆందోళన అలజడులు చెలరేగుతున్నాయి.

గ్రామీణ ప్రాంతాలలో కులమత శక్తులు బలంగా పనిచేస్తున్నాయి. వీటితోపాటు భూస్వామ్యవ్యవస్థను రక్షించటానికి పాలకవర్గాలు పంచాయతీరాజ్ వ్యవస్థ మొదలగు అనేక దొంతరులను సృష్టించాయి. దీనితో గ్రామపెత్తందార్ల అవినీతి అధికారుల స్థానిక దుష్టశక్తుల ప్రాబల్యం పెరిగింది. పోలీసుల దోపిడీ దౌర్జన్యాలు అధికమైనాయి. అక్రమ కేసులను బనాయించటం జరిగింది. పౌరహక్కులు హరించబడ్డాయి.

## భూస్వామ్య దోపిడీ పాలకవర్గ విధానాలు

వ్యవసాయ రంగంలో "భూమి" అనే ఉత్పత్తి సాధనాన్ని కొద్దిమంది తమ గుప్పెట్లో ఉంచుకొని భూస్వామ్య వర్గంగా వుంటున్నారు. భూమిపై కష్టపడి పనిచేసే అధిక సంఖ్యాకులుగావున్న రైతాంగం, వ్యవసాయ కూలీలు యితర కష్టజీవులను

---

అనేక రెట్లు అధికంగా పెరుగుతుంది" అన్న మాటలు ఎంతో వాస్తవమని అర్థం చేసుకోవచ్చు.

'ప్రజల మనిషి' నవలలో ప్రజల చైతన్యానికి భూమి సమస్య ఎలా కారణ మైందో అదే విధంగా, ఈనాటికి భూమి సమస్యే చైతన్యం అభివృద్ధి చెందటానికి కీలకాంశంగా వుందని రుజువవుతోంది. చైతన్యం అభివృద్ధి కావటానికి ఏ సమస్య కీలకమైనదో దాన్ని పరిష్కరించటానికి, అందుకు ప్రజల్ని కార్యాచరణలోకి దించటా నికి కృషి చేయకుండా ప్రజల్లో చైతన్యం లేదు కనుక పోరాడకూడదనే వారి వాదనలు ఎందుకూ పనికిరావని స్పష్టమవుతోంది.

— డి. కుమార్

ఈ భూస్వామ్యవర్గం అనేకవిధాల దోపిడీచేస్తున్నది. ఈదోపిడీకి అనుకూలంగా అనేక సమస్యలు సృష్టించబడి గ్రామీణపేదలను వేధిస్తూవుంటాయి- కూలిపాలేర్ల జీవితసమస్యలు, వెట్టి, కౌలు, పిచ్చికొలతలు, అధికవడ్డీకి అప్పులు, ఇండ్లస్థలాలు, సాంఘిక దౌర్జన్యం మొదలగు సమస్యలన్నీ భూస్వామ్య వ్యవస్థ సృష్టించిన సమస్యలే. వ్యవసాయ సమస్యలతోబాటు గ్రామీణ ప్రాంతాలలో మత్స్యపారిశ్రామికులు, గీతకార్మికులు, చేనేత కార్మికులు, కుమ్మరి, కమ్మరి, వడ్రంగి, స్వర్ణకారులు మొదలగు చేతి వృత్తులవారు అధికసంఖ్యలోనే వున్నారు. వీరివృత్తులకు గ్యారంటీలేదు.

మత్స్య పారిశ్రామికులు గ్రామీణ ప్రాంతాలలోను, ముఖ్యంగా సముద్రనదీ తీర ప్రాంతాలలో ఎక్కువసంఖ్యలో జీవిస్తూవుంటారు. వీరుపట్టేచేపలకు మార్కెట్ సౌకర్యాలు సరిగాలేవు- వీరికి కావల్సినవలలు, బోట్లు సామాన్యులకు అందుబాటులో వుండవు- ఉన్నకొద్దిపాటి వనరులతోపట్టిన రొయ్యచేపలు అధికధరలకు విదేశాలకు ఎగుమతి అవుతున్నామధ్య దళారీలమూలంగా, ఆధరలు కష్టపడి నీటిలోవుండి, చేపలు పట్టే ఆకష్టజీవులకురావు- వీరురోజుకు ఒకపూట వస్తులుండవలసిందే. వీరితోపాటు (మురుగు కాలవల్లోనూ) చేపలుపట్టుకొని జీవించే యితర కులాలవారుకూడా వున్నారు- చెరువులు మురుగుకాల్వలు వగైరా చేపలవృత్తివారికే యివ్వాలని ప్రభుత్వం బాకా లూదుతున్నా పంచాయతీరాజ్ ద్వారావచ్చిన పెత్తందార్లు, స్థానికమంత్రులు, రెవెన్యూ, పి.డబ్ల్యు.డి. డిపార్టుమెంట్లు ఏకమై పంచాయతీల కిప్పించి పేదప్రజలమధ్య తగాదాలు సృష్టించి, డబ్బుగలవారికే కట్టబెడుతున్నారు.

గీతకార్మికుల వృత్తిని దెబ్బతీయటానికి కృత్రిమ సారా ఉత్పత్తిద్వారా ప్రభుత్వం ప్రజలను అనారోగ్యవంతులను చేయటమేకాక, పాటలుపెట్టి డబ్బుగలవారికి ఎక్సైజ్ డిపార్ట్‌మెంట్ వారికి వ్యాపార కేంద్రాలుగా మార్చింది.

చేనేత కార్మికులకు నూలు, రంగులు, రసాయనాలు సరసమైన ధరలకు అందజేయబడటంలేదు. నేతకార్మికులు మాష్టర్ వీవర్ల దోపిడీకి గురవుతున్నారు- ప్రజల పేదరికంవల్ల, పెద్దపెద్ద మిల్లుబట్టల (బడాబూర్జువావర్గం) పోటీవల్ల చేనేతబట్ట విడుదలకాని ఫలితంగా ఈరంగం తీవ్రమైన సంక్షోభానికి గురవుతున్నది. అలాగే యితర చేతివృత్తులవారు ఎలాంటి రక్షణలేని స్థితిలోఉన్నారు.

బంజర్లు సొసైటీల పేరుతోమధ్య దళారీలు పాలకవర్గ పెత్తందార్లు రెవిన్యూ అధికారుల దోపిడీకి నిలయాలుగా తయారయినాయి. ఇండ్లస్థలాల సమస్య మరీఅధ్వా

న్నంగా తయారయింది. పాలకవర్గాలకు అనుకూలమైన భూస్వాముల భూములు గ్రామాలను ఆనుకొనివున్న ఆభూమి యిళ్ళస్థలాలకు పెట్టరు- గ్రామాలతో సంబంధం లేకపోయినా పాలకవర్గాలకు వ్యతిరేకులైన రైతులభూములు పేదవారి భూములు పెట్టిన వుదాహరణలు అనేకంవున్నాయి. పెత్తందార్లకు అధికారులకు లంచాలు యిచ్చిన వారి భూములు (ప్రజలుకావాలని కోరినా) మార్పుచేసిన సంఘటనలు అనేకంవున్నాయి. పాలకవర్గాలకి అనుకూలురైతే భూములువున్నా యిళ్ళస్థలాలు వున్నవారికే యిళ్ళస్థలాలు మంజూరవుతాయి ఈవిధంగా ఆచరణలో అత్యధికులైన పేదలకు బంజర్లు, ఇళ్ళ స్థలాలు లభించలేదు.

<u>భూ సంస్కరణలు</u> : మన తాలూకాలో చల్లపల్లి, కాంద్రేగులి జమీందారుల భూములుగాని, దేవస్థానాల భూములుగానీ పెద్ద భూస్వాముల భూమిగానీ, ఏమీ పోలే దంటేనే భూసంస్కరణల బూటకం అర్థం చేసుకొనవచ్చును. అధికార ముఠాలతో చేరటం ద్వారాను, బినామీ ట్రాన్సుఫర్ల ద్వారాను అధికారుల అవినీతిని ఆధారం చేసుకొని పోయే కొద్దిపాటి భూములు కూడా పోకుండా చేసుకొన్నారు. జమీందారీ విధానం రద్దుచేశామని చెప్పినా షుగర్‌ఫ్యాక్టరీ క్రింద మూడువేల ఎకరాలు జమీందారుకే వున్నది. కృష్ణలంకలోని భూములు తనకేకావాలని ట్రిబ్యునళ్ళ కోర్టులచుట్టూతిరుగుతూ ఈనాటికీ ఆ భూములను తానే అనుభవించటమో, భూస్వాములకు ధనక రైతులకు అమ్మకొనటమో జరుగుతోంది- లచ్చిగాని లంక సుమారు ఐదు వందల ఎకరాలు పైరు వేయకుండా పాడుపెట్టబడింది.

<u>వ్యవసాయ కూలీల స్థితి</u> చెప్పనవసరం లేదు- సంవత్సరానికి సరిగా నాలుగు మాసాలు కూడా పని దొరకదు- అప్పుడు కూడా కష్టానికితగ్గ ఫలితం వుండదు- కనీసం ప్రభుత్వం నిర్ణయించిన కూలీ కూడా భూస్వాములు యివ్వరు- రైతు లమ్మే ధరకు ధాన్యం వ్యవసాయ కూలీలకు దొరకదు- నిత్య జీవితావసర వస్తువుల సంగతి తలచే పనే వుండదు- పనులు లేని రోజులలో ఒక పూటకూడా తిండి సరిగా వుండదు

సామాన్య రైతుల పరిస్థితి “అమ్మబోతే అడవి. కొనబోతే కొరివి” రైతులమ్మే రోజులలో ధాన్యం ధర వుండదు- పొలాలకు సకాలంలో నీరు అందదు- ఎరువుల ధరలు రైతులకు అందుబాటులో వుండవు- శిస్తులు పెరగటం, డ్రైనేజి సెస్సు, వ్యాపార పంటలపై పన్నులు, లంచగొండితనం, అప్పుల, ధరల భారంతో క్రుంగి పోతున్నారు- పై సమస్యలతోపాటు గ్రామీణ పేదలను నిత్యం వేధిస్తూన్న అనేక సమస్యలున్నాయి.

ఈ సంక్షోభ పరిష్కారానికి వ్యవసాయిక సమస్య కీలకమైనది– దున్నేవానికే భూమి రావటం ద్వారానే ప్రజల కొనుగోలుశక్తి పెరుగుతుంది. దేశం పారిశ్రామిక వంతం కాగలుగుతుంది– అప్పుడే విదేశీ దోపిడీ అంతమవుతుంది– నిరుద్యోగ సమస్య పరిష్కార మవుతుంది– కుల, మత శక్తుల పెత్తనం కూలిపోతుంది– గ్రామీణ పేద లలో తగాదాలుపోయి ఐక్యత ఏర్పడుతుంది– పౌరహక్కులు పునరుద్ధరింపబడతాయి.

వ్యవసాయసమస్య ప్రాధాన్యతను గుర్తించిన రైతాంగం 1946–51 మధ్య కాలంలో తెలంగాణా ప్రాంతంలో నైజాంనవాబు, దేశముఖులు, జాగీర్దార్లకు వ్యతిరేకంగా ఆయుధాలుపట్టి మూడువేల గ్రామాలు విముక్తిచేసి పదిలక్షల ఎకరాల భూమిని పంపిణీచేసుకొంది. ఆకాలంలో మొత్తం ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెసు ప్రభుత్వం వందలాది విప్లవ కారులతోసహా నాలుగు వేలమంది రైతులను కాల్చి చంపింది. ఆంధ్రదేశాన్నే పోలీసురాజ్యంగా మార్చింది.

1967 నుండి నక్సల్‌బరీలోను, 69లో శ్రీకాకుళంలోను రైతాంగం భూస్వామ్య విధానానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేసింది. ఈ పోరాటాలనుకూడా ఆయా ప్రభుత్వాలు రక్తపుటేరుల్లోముంచి అనేకమంది విప్లవకారులను కాల్చి చంపివేశాయి. ప్రజలను తీవ్రమైన చిత్రహింసలకు గురిచేసి తాత్కాలికంగా ఉద్యమాన్ని అణచగలిగారు.

1947లో 'అధికారమార్పిడి' జరిగిన నాటినుండి భూస్వామ్యవిధానం పదిలంగా సంరక్షింపబడుతూనేఉంది. వ్యవసాయరంగంతోసహా దేశఆర్థిక వ్యవస్థపైన విదేశీ దోపిడీదారుల పట్టుపెరిగింది. అధికారంలో పాలకవర్గ ముఠాలుమారినా భూస్వామ్య–సామ్రాజ్యవాద దోపిడీ సాగినంతవరకు ప్రజలయొక్క ఏమౌలిక సమస్యా పరిష్కారంగాదు.

[దివి తాలూకా గ్రామీణ పేదల సంఘం, 3–10–77 న వేసిన కరపత్రంలో నుంచి]

---

# వరంగల్ పాలిటెక్నిక్‌లో ఆగస్టు 10న ఏం జరిగింది? జి. పి. రావు విచారణ ఏమయింది??

10-8-1978 రోజు ఆర్.టి.సి. బసులో ప్రయాణిస్తున్న పాలిటెక్నిక్ విద్యార్థిపై బస్సు కండక్టర్ అనవసరంగా చేయి చేసుకున్న సందర్భంగా పాలిటెక్నిక్ విద్యార్థులు ఆ కండక్టర్‌తో క్షమాపణ చెప్పించడానికి శాంతియుతంగా బస్సులను ఆపి ఆ కండక్టర్ రావాలని కోరారు. సంప్రదింపులద్వారా శాంతియుతంగా ముగియనున్న ఆ ప్రయత్నంలో అటు ఆర్.టి.సి. ఎంప్లాయీస్‌ను యిటు విద్యార్థులను రెచ్చగొట్ట ప్రయత్నించి పోలీసులు విఫలమయ్యారు. దాంతో విద్యార్థులపై ఎప్పుడు విరుచుకు పడదామా అన్న పోలీసులు విద్యార్థులపై లాఠీచార్జీ జరిపి పాలిటెక్నిక్ ఇన్‌స్టిట్యూట్ ఆవరణలోనికి బాష్ప వాయువును ప్రయోగించారు. విద్యార్థులు టియర్ గ్యాస్ షెల్సును ఆవరణలోనున్న నీటిగుంటలో పడేసి వాటిని పనికిరాకుండా చేయటంతో పోలీసులకు పిచ్చెక్కింది. వారిని తుపాకీ మడిమెడలతో లాఠీలతో కొట్టుకొంటూ క్లాసురూములోనికి తరుముకువచ్చి విద్యార్థులను, కాలేజీ స్టాఫ్‌ను స్పృహ తప్పేటట్టు కొట్టారు. వీరిలో చాలామంది జూనియర్ టెక్నికల్ స్కూల్లో చదువుతున్న 13-17 సం॥ల మధ్య వయసులోఉన్న పిల్లలు 10 మందికిపైగా విద్యార్థులకు, స్టాఫ్ మెంబర్స్ అయిన ఎం. అనాసరి (లైబ్రేరియన్) కొమురయ్య (అటెండర్)లకు బలమైన గాయాలు తగిలాయి, వీరిలో ముగ్గురితలలు పగిలి నెత్తురుచిందాయి. నిన్న మొన్నటి దాకా పాలిటెక్నిక్ కాలేజీకి వెళ్ళిచూస్తే మెకానికల్ రూమ్‌లోను, డ్రాయింగ్ రూమ్‌లోనూ, మెట్లమీద చిందిన నెత్తురుమరకలుభయంతో విడిచేసిన చెప్పులు, విద్యార్థులమీద పోలీసులు విసిరేసినకర్రలు, విద్యార్థులు రక్షణకోసం అడ్డంగా పెట్టుకొన్నబల్లలు, పోలీసుల లాఠీ దెబ్బల వలనజరిగిన దృశ్యాలు కనిపిస్తుండేవి. అంతేకాదు, తరగతిగదుల్లో భయంతో దాక్కొన్నవారిని తలుపుల అద్దాలను పగులగొట్టి, బోల్టులనుతీసి పోలీసులు విద్యార్థులను, స్టాఫ్‌ను విచక్షణా రహితంగా కొట్టి, 37 మంది విద్యార్థులను అరెస్ట్‌చేశారు.

ఈ సంసఘటన జరిగిన తర్వాత గాయాలుతగిలిన వారినికూడా వ్యాన్‌లో ఎక్కించుకొని ఎం.జి.యం. ఆసుపత్రికి తీసుకువెళ్ళి, బ్యాండేజీలు కట్టించి, వారిఆరోగ్యస్థితి ప్రమాదకరంగా వున్నప్పటికీ హాస్పిటల్‌లో అడ్మిట్ చేయకుండా, వారిని వదిలిపెడితే విద్యార్థులపట్ల ప్రజలసానుభూతి, పోలీసులపై ఆగ్రహం, అసహ్యం పెరుగుతుందనే భయంతో అరెస్ట్‌చేసి, వాళ్ళను లాకప్‌లో పెట్టి నానాయిక్కట్ల పాలుచేసి, కనీసం తిండి

కూడా పెట్టలేదు. ఇదంతా డి.ఆర్.వో, ఎస్పీ, డి.ఎస్పీ, మొదలగువారి ముందర, వారి ఆజ్ఞలతో జరిగింది. తీవ్రమయిన గాయాలు తగిలిన విద్యార్థులను ఆసుపత్రిలో వెంటనే చేర్పించవలసిన అవసరం ఉన్నప్పటికీ కేవలం తలకు కట్లుమాత్రం కట్టించారు. ఇది తగిలినగాయాల తీవ్రతను తక్కువచేసి చూపాలనే కుట్రతో కావాలనిచేసిన పనితప్ప మరేమీలేదు.

పాలిటెక్నిక్ కాలేజీ టీచింగ్, నాన్‌టీచింగ్ సభ్యులు అదేసాయంత్రం చేసిన ఏకగ్రీవతీర్మానం ఈ పైవిషయాలను స్పష్టంగా తెలియ చేస్తోంది. ఆ తీర్మానాన్ని యధాతథంగా క్రిందయిస్తున్నాం.

1. ఇన్-చార్జి ప్రిన్సిపాల్‌గావున్న శ్రీ దశరథ రామయ్యగారు కాలేజీ ఆవరణలోకి ప్రవేశించడానికి, క్లాసులోఉన్న విద్యార్థులను అరెస్ట్ చేయడానికి, పోలీసులు తమఅనుమతి తీసుకోలేదని చెప్పారు.

2 ఇక్కడ పనిచేస్తున్న స్టాఫ్‌కాని, చదువుతున్న విద్యార్థులకుగాని జీవితానికి భద్రత లేదని వీళ్ళు ఆందోళన వ్యక్తంచేశారు.

3. కళాశాల సిబ్బందియగు శ్రీ ఎం.ఎ. అన్సారీ, శ్రీ ఎస్. కొమురయ్యలను హెడ్ మెకానికల్ ఇంజనీరింగ్ సెక్షన్- డ్రాయింగ్ హాల్ నెం-1 లో విద్యార్థులను పోలీసులు తీవ్రంగాకొట్టి, 37 మంది విద్యార్థులను అరెస్ట్‌చేశారు.

4. ఈ సంఘటనపై "న్యాయవిచారణ జరిపించాలి"

పైవిషయాలు కలెక్టరుతో, సాంకేతిక విద్యామంత్రితో, డైరెక్టర్‌తో చెప్పారు. ఈ సంఘటనలపై మేజిస్ట్రేట్‌తోను, సబ్-కలెక్టర్‌తోను విచారణ చేయించి మసిపూసి మారేడుకాయ చేయాలని పాపం మంత్రిగారు ఎన్నో ఎత్తులు వేశాడు. ఎస్పీ కూడా "పోలీసులు సకాలంలో అక్కడికివచ్చి వుండకపోతే, ఆర్.టి.సి. వుద్యోగుల చేతుల్లో విద్యార్థులు చచ్చివుండే వారని" పోలీసులు చేసిన దౌర్జన్యాన్ని సమర్థించాడు. ఇవి యిట్లుండగా ఫోటోలుతీసి, దెబ్బలుకొట్టి అరెస్ట్‌చేసి భీభత్సాన్ని సృష్టించాడు- అన్యాయాన్ని కాపాడటానికి- అవతార మెత్తినట్లున్న ఎస్పీ నర్సింహమూర్తి. ఇద్దరిద్దరుగా శాంతియుతంగా ప్రదర్శనచేస్తూ, "అరెస్ట్‌అయిన 37 మంది విద్యార్థులను వెంటనే బేషరతుగా విడుదల చేయాలని కలెక్టర్‌కు మెమొరాండం యివ్వడానికి పోయిన 100 మందిలో 45 మంది యూనివర్సిటీ విద్యార్థులను ఒకరోజంతా పోలీస్ స్టేషన్‌లో పెట్టి బలవంతంగా ఫోటోలు తీసుకొని, అడ్రసులు రాసుకొని పర్సనల్‌బాండ్స్ తీసు

కొని రాత్రికి వదిలేసారు. 10వ తేదీన అరెస్ట్‌చేసిన 37 మందిని కోర్టులో హాజరుపరిచి [వారిలో తలగాయాలకు కట్లుగట్టుకొని మొఖాలుకూడా ఏర్పడకుండావున్న విద్యార్థులు కూడా వున్నారు.] తప్పుడుకేసు బనాయించి, జైలుకు పంపించగా, మేజీస్ట్రేట్ వారిని బెయిల్‌పై వదిలారు. ఈ సమస్యతో ఏసంబంధంలేని జ్ఞానేశ్వర్‌ను, ఆర్ట్సు కాలేజీ విద్యార్థులను అరెస్ట్ చేశారంటే పోలీసులు పిచ్చికుక్కలై పోయారని, వీళ్ళ చేతుల్లో యీపట్టణ విద్యార్థులకు, ఉపాధ్యాయులకు, ఉద్యోగులకు, ప్రజలందరికీ రక్షణ లేకుండా పోయిందని తెలుస్తూనేఉంది. ఇది పోలీసు రాజ్యంకాక మరేమిటి?

పాలిటెక్నిక్ విద్యార్థులపై పోలీసులు జరిపిన లాఠీ చార్జికి నిరసనగా వరంగల్‌లో కాలేజ్‌లు, స్కూళ్ళు మాత్రమే కాకుండా రాష్ట్ర వ్యాప్తంగా విద్యార్థులు ఆందోళన జరిపారు. ముఖ్యంగా హైదాబాద్, గుంటూరు, విజయవాడ పాలిటెక్నిక్ విద్యార్థులు మిలిటెంట్ ఆందోళన ద్వారా వరంగల్ పాలిటెక్నిక్ విద్యార్థులకు తమ సంఘీభావాన్ని ప్రకటించారు. అసెంబ్లీలో అడిగిన ప్రతిపక్షనాయకులే జుడీషియల్ విచారణ కోసం అడగక పోయినందువల్ల సమస్యను సరిగా ప్రతిపాదించలేక పోయినందువల్ల జాయింట్ సెక్రటరీ స్థాయి విచారణకు విద్యార్థులు, పాలిటెక్నిక్ వుద్యోగులు అంగీకరించాల్సి వచ్చింది. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం సాధారణ పరిపాలనాశాఖ సంయుక్త కార్యదర్శి జి. పి. రావు గారు వరంగల్ వచ్చి నాలుగు రోజులు వుండి విద్యార్థుల, పాలిటెక్నిక్ అధ్యాపకుల, వుద్యోగుల, ఆర్.టి.సి. వుద్యోగుల, అధికారుల, పోలీసుల వాఙ్మూలాలు, సాక్ష్యాలు టేప్ రికార్డ్ చేసుకొని వెళ్ళిపోయాడు. ఆయన స్వయంగా పాలిటెక్నిక్ వెళ్ళి కాలేజీ నుంచి రాయి విసిరితే ఎంత దూరం పోతుందో, అది రోడ్డు మీదకు పోతుందో లేదో విసిరి చూశాడు. ఆగస్ట్ 10న ఏ యే నెంబరు బస్సులు నడిపారు, ఏ యే బస్సులు విద్యార్థుల రాళ్ళు పడి చెడిపోయాయి (13 బస్సులు చెడిపోయాయని పోలీసులన్నారు. నిజానికి ఒకే ఒక్క బస్సు అద్దాలు పగిలాయన్నది వాస్తవం- ఏమైనా జి.పి. రావు గారు ఏంచెప్తాడో వేచి చూద్దాం) ఆయన కూలంకషంగానే విచారణ చేసాడని, ఆయనను కలుసు కొన్న పౌరహక్కుల బాధ్యులు అన్నారు- కాని ఆగస్ట్ 21న రిపోర్ట్ ముఖ్యమంత్రికి జి. పి. రావు గారు సమర్పిస్తారని అన్నారు- సెప్టెంబరు 21 గడిచిపోయి, అక్టోబరు వచ్చినా ఆయన సమర్పించిందీ లేనిదీ తెలియదు- విచారణ కోసం అడిగిన అసెంబ్లీ సభ్యులు మళ్ళీ దానిని ప్రస్తావించనూ లేదు పట్టించుకోనూ లేదు. సెప్టెంబరు 10 దాకా కూడా విద్యార్థులను కోర్టు కేసులకు తిప్పి చివరకు ముఖ్యమంత్రి వరంగల్‌కు వచ్చినపుడు టౌన్ హాలు సభలో విద్యార్థులు, ఇతర ప్రజాస్వామ్య వాదులు నిలదీసి ప్రశ్నించినపుడు గానీ వాళ్ళపై కేసులు ఎత్తి

వేసుకొన్నట్లు ప్రకటించలేదు. ముఖ్యమంత్రి ప్రకటనతో నిమిత్తం లేకుండానే, అంటే పోలీసులు కేసు వుపసంహరించుకోకుండానే కోర్టు పాలిటెక్నిక్ విద్యార్థులపై కేసు కొట్టివేసింది. కనుక చెన్నారెడ్డి చేసిన ఘన కార్యంగానీ, ఉపకారంగానీ అందులో ఏమీలేదు. ఇంతకూ విద్యార్థులపై బనాయించినవి తప్పుడు కేసులని అందరికీ తెలుసు-కాని వాళ్ళ పట్ల పాశవికమైన నేరం చేసిన పోలీసుల మాటేమిటి? వాళ్ళు శిక్షింపబడకుండా న్యాయం జరిగినట్లేనా?

ఏప్రిల్ నెలలో రమేజాబీపై పోలీసులు జరిపిన అత్యాచారంపై ముక్తధర్ కమీషన్ తీర్పు యిస్తూ రమేజాబీని పోలీసులు అమానుషంగా చెరిచారని, ఆమె భర్తను నిర్దాక్షిణ్యంగా కొట్టి చంపారని, పోలీసు అధికారులు ఆమెను తప్పుడు కేసుల్లో యిరికించ చూశారని తన నివేదికలో రిపోర్ట్ చేస్తూ స్త్రీల పైన పోలీసులు జరిపే అత్యాచారాలను- మానభంగాలను తీవ్రంగా ఖండిస్తూ పోలీసులను దోషులుగా పేర్కొంది. కొద్ది రోజుల క్రితం బెల్లంపల్లిలో జరిగిన సంఘటన, హర్యానాలోని రోహ్టక్ వైద్య కళాశాల విద్యార్థుల చేతులకు బేడీలు వేసి లాకప్‌లో వుంచిన దౌర్జన్యపూరితమైన సంఘటన, ఏ తీర్పు రాకుండా తుంగలో తొక్కేసిన భార్గవ కమీషన్ విచారణ తంతు- యీ ప్రభుత్వపు పోలీసుల హత్యా స్వభావాన్ని పాశవిక ప్రవృత్తిని తెలియచేస్తోంది.

మరి యివన్నీయిట్లా బయట పడుతోంటే గుణపాఠం తీసుకునేబదులు పోలీసులు మరింత పిచ్చికుక్కలై పోతున్నారనిపిస్తుంది. సంఘటితమైనటువంటి ప్రజాందోళన జర్పించి యీ పిచ్చికుక్కలని అదుపులో పెట్టకపోతే, యివి పౌరులనందరిని కరవకుండా వుండవు. మొన్న రమేజాబీని చెరచిన నిన్న బెల్లంపల్లిలో కార్మిక స్త్రీని చెరచిన సంఘటనపై యిద్దరి ప్రాణాలు బలిగొన్న, నేడు పాలిటెక్నిక్ విద్యార్థులను స్టాఫ్‌ను, కాకతీయ యూనివర్సిటీ విద్యార్థులనుకొట్టి అరెస్ట్ చేసిన యీ పోలీసులు రేపు నిన్నూ, నన్నూ మనలందరినీ మన బళ్ళలోనేకాదు, మనయిళ్ళలోకూడా ప్రవేశించి, మనల్నేకాదు, మన చెల్లెళ్ళను, మన తమ్ముళ్లను- తల్లితండ్రులను కొట్టవచ్చు. చంపవచ్చు. యింకేమైనా చేయొచ్చు. ఈసంఘటనలన్నీ మనప్రభుత్వంయొక్క ప్రజావ్యతిరేక స్వభావాన్ని, పోలీసుల రాక్షస స్వభావాన్ని తెలియజేస్తున్నాయి- మనమందరం సంఘటితమై ఏకంగా ప్రతిఘటించి తీరందే మన బ్రతుకులకు గ్యారంటీ వుండబోదు.

---

కథలు కావాలి

ప్రజా జీవితాన్ని, విప్లవ చైతన్యాన్ని సజీవంగా స్పందించే కథల కోసం సృజన రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నది.

---

చర్చా వేదిక :

# విరసంఎలావుంది? ఎలావుండాలి? సమాధానం

మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానం ప్రణాళికలో వుండటవల్ల విరసం సంకుచిత వేదిక కాలేదు- ఈ ఆశయాన్ని ప్రజల్లోనూ రచయితల్లోనూ విస్తృతంగా ప్రచారం చేయలేక పోవటం వల్లనే అది విస్తృతం కాలేదు. విద్యావంతులకు కూడా ఈ సిద్ధాంతాన్ని అర్థం అయ్యేటట్టు వివరించే కార్యక్రమం విరసం చురుకుగా చేపట్టలేక పోయింది పూర్తిగా తమ కాలాన్ని విరసానికి వుపయోగించే సభ్యులు లేరు. అధ్యయన శిబిరాలను పెట్టి ఇతర రచయితలకూ సాహిత్య అభిమానులకూ విరసం ఆశయాలను గురించి అవగాహన పెంచే కృషిని చేయలేక పోయింది, ఇప్పుడయినా విరసం చేయవలసిన పని యిదే- విప్లవ రచయిత పార్టీ సభ్యుడు కావచ్చును, కాకపోవచ్చును- విప్లవ పార్టీలను గురించిన అవగాహన విరసం సభ్యుడికి అవసరం- సాంస్కృతిక పోరాటానికి ప్రత్యక్షంగా సంబంధంలేని పార్టీల వ్యవహారాలు విప్లవ రచయిత పట్టించుకోవలసిన అవసరంలేదు- అలాగే రచయితలు తమ సొంత రచనలను ప్రచారం చేసుకోవటం మీద మాత్రమే కాక విప్లవ సాహిత్య వుద్యమాన్ని సుసంపన్నం చేయటం మీద కూడా దృష్టి కేంద్రీకరించాలి- మార్క్సిజం - లెనినిజం - మావో ఆలోచనా విధానం లోతుగా అధ్యయనం చేసిన వాళ్ళే విరసంలో చేరాలని విరసం వుద్దేశం కాదు- స్థూలంగా ప్రజలుచేసే విముక్తి పోరాటాలమీదా, సాంస్కృతిక రంగంలో జరుగుతున్న పోరాటం మీదా అవగాహనవున్న ఏ యువరచయిత అయినా చేరవచ్చు. క్రమంగా ఇతర సభ్యుల సాహచర్యంతోనూ, అధ్యయనంతోనూ విప్లవ సిద్ధాంత పరిజ్ఞానం పెంచుకోవచ్చు ప్రపంచ వ్యాప్తంగా సిద్ధాంత గందరగోళం జరుగుతున్న కాలంలో సిద్ధాంత నిబద్ధత సంస్థలకు చాలా అవసరం- విప్లవ సిద్ధాంతం లేకుండా రివిజనిజాన్ని ఎలా ప్రతిఘటించ గలం? మార్క్సిజానికి కట్టుబడి భూస్వామ్య, సామ్రాజ్యవాద సంస్కృతి మీద పోరాటం చేసేవాడికీ, మార్క్సిజానికి కట్టుబడకుండా పోరాటం చేసేవాడికీ తేడా లేదా? ప్రజా రాజకీయాల ఆదిపత్యం అంగీకరించకుండా ప్రజావ్యతిరేక భావాజాలాన్ని ఎలా ప్రతిఘటిస్తారు? భావాలను భావాలతో ఎదుర్కోవటం భావ వాదమే అవుతుంది- భావాలవర్గపునాది మీద జరిగే పోరాటంలో భాగంగా, రాజకీయ పోరాటంలో అవిభాజ్యంగా పోరాటం చేయగలిగినప్పుడే రామాయణం, భగవద్గీత, బైబిల్ వంటి గ్రంథాల ప్రభావాన్ని నిరాకరించగలుగుతాం. పాలకవర్గాలు తమ ప్రయోజనంకోసం సాధనాలుగా చేసుకొనటం వల్లనే ఈ గ్రంథాలకు ప్రాచుర్యం వచ్చింది- సాంస్కృతిక రంగంలో వర్గపోరా

టాన్ని గురించిన శాస్త్రీయ దృక్పథం మార్క్సిజం - లెనినిజం - మావో ఆలోచనా విధానం వల్లనే వస్తుంది.

2. విప్లవ రచయితల సంఘం వ్యక్తులుగా భూస్వాముల్ని చంపటం విప్లవంగా భావిస్తోందని నిలువెత్తు కరపత్రాల్లో ప్రచారం చేస్తున్నారు. దోపిడీ వర్గాన్ని అధికారం నుంచి కూలదోయటం అంటే దోపిడీ వర్గం మొత్తాన్ని వ్యక్తులుగా నరికి పారవేయటం అనుకునే జగదేక మూర్ఖుడు ఎవడయినా వుంటాడా? ఆరోపణ చేయటానికి ఇంగిత జ్ఞానం అన్నా వుండొద్దా? ప్రతి సాహిత్య వుద్యమానికి కొన్ని మాటలూ కొన్ని వ్యక్తీకరణ ధోరణులూ వుంటాయి. పురాణ, ప్రబంధ, భావకవిత్వ, అభ్యుదయ సాహిత్య వుద్యమాల్లో దేన్ని పరిశీలించినా, ఉద్యమభాష అర్థం అవుతుంది. అలాగే విప్లవ సాహిత్యంలోనూ దోపిడీ వర్గాలనుగురించి చెప్పేటప్పుడు రచయితలు అందరూ కొన్ని మాటలను వాడి వుండటం సహజం. దిగంబర కవిత్వప్రభావంవల్ల కొన్ని అవాంఛనీయ పదచిత్రాలు యువ విప్లవ కవుల్లో దొర్లినాయి- విప్లవ కవిత్వంలో వైవిధ్యం లేదనుకోవటం పొరపాటు. ఏ కవీ మరొకరిలా రాయలేదు. ప్రతిధ్వనులు రాసేవాళ్ల అన్ని వుద్యమాల్లోనూ వుంటారు. చెరబండరాజు, వంగపండు, రమణారెడ్డి, నగ్నముని, శివసాగర్ ఒక విధంగానే రాస్తున్నారా? అశయం వొకటే అయినా విప్లవ కవిత్వంలో వైవిధ్యంవుంది. (అరుణతార 1: 4-5 సంచికలో త్రిపురనేని మధుసూదనరావు)

## మీ మీ విమర్శలకు కృతజ్ఞులం....

సోదర పత్రిక 'సృజన' విరసంకు సకాలంలో మంచి వుపకారమే చేసింది- "విరసం ఎలా వుంది? ఎలా వుండాలి?" అనే అంశం గురించి పేరుమోసిన అడ్వొకేట్లు ప్రొఫెసర్లు మొదలు విద్యార్థుల వరకు భిన్నశ్రేణుల మనుషుల అభిప్రాయాలను రాబట్టింది- ఆత్మ పరిశీలన చేసుకుంటున్న తరుణంలోనే యీ విమర్శలు వెలువడడం విరసం భవిష్యత్తుకు కొంత వెలుగును పరచినట్టయింది- ముఖ్యంగా, సంకుచిత భావ ధోరణి అనే ఆత్మవినాశకమయిన విషపదార్థానికి యిది విరుగుడే.

విరసం ప్రచ్ఛన్న రాజకీయ సంస్థ అనో, ఏదో ఒక రాజకీయ పార్టీకి తోక అనో ప్రభుత్వం ఆరోపిస్తున్నట్టే, కొందరు మిత్రులు అపోహ పడటం విచారకరం- విరసంకు రాజకీయం లేదా అంటే, తప్పని సరిగా వుంది- అయితే అది వట్టి 'పార్టీ రాజకీయం' గాని, అధికార రాజకీయంగాని కాదు- చరిత్ర గమనాన్ని నిశ్చితమయిన మలుపు తిప్పి సామాజిక వ్యవస్థను మారాకు తొడిగించగల ప్రజా విప్లవోద్యమమే విరసం రాజకీయం, అది సువిశాలమయిన కార్యరంగం, సాహిత్యకంగా సాంస్కృతి

కంగా విరసం యీ కార్యరంగంలో ఒకానొక నిర్దిష్టమయిన అంశం- సాహిత్యం జీవితానికి వెలిబడిందో లోబడిందో కాదు.

'మేసోనిక్ లాడ్జ్' లాంటి మాటలను విరసం పట్ల వాడిన వ్యక్తులు ఎంత పెద్దవారయినా కావచ్చు గాని, విరసం రహస్య సంస్థగా ఎన్నడూ పనిచెయ్యలేదని గ్రహించాలి- ఇక 'సెక్టేరియన్' వైఖరులందామా, వాటి నుంచి బయటపడేందుకే విరసం చిత్తశుద్ధితో ప్రయత్నిస్తూ వుందని మాత్రం చెప్పగలం. 'కమిట్‌మెంట్' అనేది తప్పనిసరి ఇదే గిరిగీసుకోవడం కాదు- జనతా ప్రజాస్వామిక విప్లవోద్యమానికి మార్గదర్శక సూత్రావళినే గాక ఆచరణలో రుజువనిపించుకున్న పంథాను కూడా మార్క్సిజం, లెనినిజం మావో ఆలోచనా విధానం సమకూర్చుతున్నప్పుడు, దాన్ని కాదంటూ మాయదారి మాటల ముసుగుల చాటున సామాజిక, సాంస్కృతిక లక్ష్యాలను దాచి వెయ్యడం విరసంకు చేతగాని గారడీ.

సాహిత్య, సాంస్కృతిక రంగంలో విప్లవవాదులనే గాక ఇతర వ్యక్తులనూ సంస్థలనూ సమీకరించేందుకు విరసం ఎన్నడూ వ్యతిరేకత చూపలేదు- సంస్థ ప్రణాళికలో గూడా యీ విషయాన్ని పేర్కొన్నాం. అలా పని చేస్తున్నాం గూడా. అందుచేత సాంస్కృతిక ఐక్య సంఘటనకు విరసం అనుకూలంగానే వుంటుంది- అయితే ఇది వట్టి కపట నాటకం కాకూడదని, రాజీ-సర్దుబాటు-లొంగుబాటు వ్యవహారం కాగూడదని భావిస్తూంది.

రాజకీయ పార్టీకి దేనికీ కార్బన్ కాపీ కాకుండా, పీడిత ప్రజా విప్లవ రాజకీయం ప్రధానాంశమయిన సమకాలిక సంక్షుభిత ప్రజా జీవితమే మూల ప్రేరణగా, నిబద్ధత విశిష్ట లక్షణంగా, విరసం ఒక విలక్షణమయిన సాహిత్య, సాంస్కృతిక సంస్థ కాగలుగుతున్నది- అది లేనప్పుడు, విరసం అవసరం లేదు- రచయితల కళాకారుల సంస్థగా విరసం తన చారిత్రక కర్తవ్యాన్ని నిర్వర్తించేందుకు మీ నిర్మాణాత్మక విమర్శను స్వాగతిస్తున్నది.

.... గాని మీమీ ఆరోపణలకు కాదు!

[విరసం సాహిత్య సాంస్కృతిక త్రైమాసిక 1 : 4-5
జూన్-నవంబర్ 78 వార్షిక సంచిక సంపాదకీయం]

విజయవాడలో అక్టోబర్ 8,9 తేదీల్లో జరిగిన విప్లవ రచయితల సంఘం సర్వసభ్యసమావేశం విరసం చరిత్రలో పేర్కొనదగిన గీటురాయి. మొట్టమొదటి సారిగా విరసం ఆత్మవిమర్శనా విధానానికి పూనుకున్నది. అక్కడ జరిగిన చర్చలు ఆత్మవిమ

ర్శన ముసాయిదా సిద్ధంచేసుకోవడానికి తోడ్పడ్డాయి. ఆ ముసాయిదా జనవరిలో ఆమో దించబడుతుంది.

ఈరెండురోజులు చర్చల ఫలితంగా రూపొందిన ఆత్మవిమర్శనా ముసాయిదాసార మేమిటంటే సంస్థసడతలో నష్టప్రభావంవేసి దానినొక తనలోతాను తృప్తిచెందిన సంస్థగా మార్చివేసి దానిసారభూతలక్షణమైన సాహితీ సాంస్కృతిక స్వభావాన్ని మరుగుపరచిన అతివాద సెక్టేరియన్ ప్రభావాన్ని నిర్ద్వంద్వంగా తోసిపుచ్చింది. విప్లవ రచయితల సంఘం తనచరిత్రలో ఇప్పుడు ఒక కొత్తదశకు చేరుకున్నది. విప్లవానికి తన కమిట్‌మెంటును కాపాడుకుంటూనే సాహిత్య సాంస్కృతిక కార్యకలాపాలకు ప్రాముఖ్యం ఇవ్వదలుచుకున్నది. అంటే విప్లవ రచయితలసంఘం తన సముచితమైన కార్యరంగాన్ని నిర్వచించు కుంటున్నదన్నమాట.

(విజయవాడ సర్వసభ్య సమావేశం తర్వాత విరసంతరపున కార్యదర్శి పత్రికలకు విడుదలచేసిన ప్రకటన)

విరసం ఇప్పటిదాకా అనుసరించిన తలుపులు మూసుకునే విధానాన్ని విడనాడుతున్నది. ప్రభుత్వం దృష్టిలోనూ సమ్మె జనందృష్టిలోనూ మాదిఒక రాజకీయసంస్థ అనే అభిప్రాయాన్ని కొందరు కలిగించారు. దీనికి కొంతవరకు మేంకూడ బాధ్యులమే. మేము విప్లవ రాజకీయాలు ఎత్తుగడల గురించి మా సాహిత్య సాంస్కృతిక స్వభావం మరుగున పడిపోయేంతగా ప్రాధాన్యమిచ్చాం. విప్లవ లక్ష్యానికి కట్టుబడిఉండే మా కమిట్‌మెంటును మేం వదులుకోవటంలేదు మేమిప్పుడు గుర్తించిందల్లా సాహిత్య, సాంస్కృతిక రంగంలో మా కార్యక్షేత్రాన్ని నిర్వచించు కోవడంవల్ల మేము విప్లవానికి మరింత చక్కగా సేవచేయగలుగుతాం.

అతివాద ఒంటెత్తు వాదానికి మితవాద అవకాశ వాదానికి లోనుగాకుండా సాహిత్య సాంస్కృతిక రంగాల్లో విరసం ప్రజాపంథా ననుసరిస్తుంది. (విరసం పత్రికా ప్రకటనను విడుదలచేస్తూ విజయవాడ పత్రికా విలేఖరుల గోష్టిలో విరసం కార్యదర్శి ఇచ్చిన వివరణ.)

---

# విజయవాడ సర్వసభ్య సమావేశం 9-10-78న ఏకగ్రీవంగా ఆమోదించిన తీర్మానాలు

## 1. ఆదిలాబాదు, కరీంనగర్ జిల్లా రైతాంగ పోరాటాలపై భూస్వాముల, పోలీసుల దమనకాండను ఖండించండి.

హరిజన, గిరిజన, బలహీనవర్గాల ప్రజలకు భూవసతి, గృహవసతి కల్పిస్తానని వారిబతుకుల్లో చీకట్లు పోగొట్టడానికే ఓట్లకోసం వచ్చానని చెప్పిన ఇందిరా కాంగ్రెస్ ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్‌లో భూమికోసం భుక్తికోసం తలదాచుకోవడానికి నెలవుకోసం పోరాడుతున్న పేద రైతుకూలీజనంపై దారుణమైన హింసాకాండను అమలుచేస్తున్నది. జగిత్యాల, మెట్‌పల్లి, సిరిసిల్ల ప్రాంతాల్లో భూస్వాములకు దొరలకు పెత్తందార్లకు వ్యతిరేకంగా ప్రతిఘటనా పోరాటం చేస్తున్న రైతాంగంపై భూస్వాములే స్వయంగా దౌర్జన్యం చేస్తున్నారు. కాల్పులు జరుపుతున్నారు. క్యాంపులు పెడుతున్నారు. ప్రజా కార్యకర్తలను, రైతులను పందల సంఖ్యలో అరెస్టులు చేస్తున్నారు. గ్రామాల్లో సైతం లాఠీచార్జులు 144వ సెక్షన్‌లు అమలు చేస్తున్నారు. కరీంనగర్ జిల్లా మెట్‌పల్లి తాలూకా చినమెట్‌పల్లి గ్రామంలో ప్రజలపై భూస్వామి స్వయంగా కాల్పులు జరిపాడు. జగిత్యాల తాలూకా లోతునూరులో పోలీసులు జరిపినకాల్పుల్లో పోచయ్య అనేపేదరైతు మరణించాడు. 800 మంది పేదప్రజల్ని అరెస్టుచేసి అక్రమకేసుల్లో యిరికించి వందల మైళ్ళదూరంలో వున్న రాజమండ్రి జైలుకు పంపించారు. సిరిసిల్ల తాలూకా బోయినపల్లి, చెక్కపల్లి, వేములవాడ, కోడుముంజె, పదిర, నిజామాబాద్, కోనరావుపేట మొదలయిన గ్రామాల్లో రైతాంగ ప్రతిఘటనా పోరాటాలపై భూస్వాముల, పోలీసుల దౌర్జన్యకాండ సాగుతున్నది.

హరిజన, గిరిజన, బలహీనవర్గాలపై జరిగే దౌర్జన్యాలను సహించేదిలేదని ఒక వైపు కఠినమైన హెచ్చరికలు చేస్తూనే ప్రధానమంత్రి మరొకవైపు ముఖ్యమంత్రుల సమావేశంలో శాంతిభద్రతలు కాపాడడానికి అవసరమైతే దోపిడిచట్టాన్ని ప్రవేశపెట్ట వలసిందని సూచనలను చేస్తున్నాడు.

ఆదిలాబాద్, కరీంనగర్ రైతాంగ వీరోచిత పోరాటాలను అభినందిస్తూ ఆపోరాటాలపై భూస్వాములు, వారికి వత్తాసుగా పోలీసులు, రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు తీసుకుంటున్న అణచివేత కార్యక్రమాన్ని విరసం తీవ్రంగా ఖండిస్తున్నది. రైతాంగంపై జరుగుతున్న ఈ భూస్వాముల, పోలీసుల దమనకాండను ఖండించ వలసిందిగా విరసం ప్రజాతంత్ర శక్తులకూ, వ్యక్తులకూ విజ్ఞప్తి చేస్తున్నది.

2. ప్రాథమిక విద్యాలయాల్లో మతవిషం.

మోడల్ పాఠశాలల పేరుతో మనరాష్ట్రంలో ప్రతిజిల్లాలోనూ ఎన్నో కొత్త తరహా పాఠశాలలను స్థాపించేందుకు రాష్ట్రప్రభుత్వం పూనుకుంది. వీటినిర్వహణకోసం గ్రామస్థాయినుంచి రాష్ట్రస్థాయివరకు వివిధ పరిపాలనా సంస్థలను నెలకొల్పుతూంది. ఈ పాఠశాలల వుపాధ్యాయులను ఎంపికచేసి బెంగుళూరుకు దగ్గర్లో సత్యసాయిబాబా నిర్వహించే వైట్‌ఫీల్డు సంస్థలో శిక్షణ నిప్పిస్తూంది. ఈ శిక్షణలో భాగంగా వుపాధ్యాయులకే మతాన్ని కొత్త వింతరూపాల్లో నూరిపోయడం జరుగుతూందంటే ఇక బాల బాలికల విషయం ఏమికానుందో అర్థంచేసుకోవచ్చు. సాయి సంకీర్తనలవంటి అంశాలతో మతవిషయాలకు ప్రాముఖ్యం వున్న పాఠ్యాంశాలతో కొత్తతరం మనస్సులను విషంతో నింపివేసే యీ దుష్టప్రయత్నాలను మొగ్గలోనే తుంచివెయ్యాలని వుపాధ్యాయ సంస్థలకు, తల్లిదండ్రుల సంస్థలకు బుద్ధి జీవులకందరికీ విరసం విజ్ఞప్తి చేస్తున్నది. వేదాలను, కొరాన్, బైబిలును పునర్ముద్రించేందుకు కోట్లాదిధనం ఖర్చయేలా తిరుమల-తిరుపతి దేవస్థానాన్ని కోరుతున్న రాష్ట్రప్రభుత్వంపైకి లౌకిక రాజ్యాంగ పద్ధతులను గౌరవిస్తున్నట్లే నటిస్తూందిగాని, నిజానికి లౌకిక దృక్పథాన్నే నశింప జేసేందుకు పనిగట్టుకొని ప్రయత్నిస్తూంది. కాబట్టి ఈ కుత్సితాన్ని సకాలంలో గుర్తించి ప్రతిఘటించాలని విరసం లౌకిక, ప్రజాస్వామిక, హేతువాద దృక్పథం కలిగిన వారందరికీ విజ్ఞప్తి చేస్తుంది.

3. వాడుక భాష.

ప్రజల జీవితానికి సన్నిహితంగా రచయితలు రచనలు చేయడానికి ప్రయత్నిస్తున్న యీ కాలంలో పాఠశాలల్లో నేర్పుకునే భాషమాత్రం పాతరాతి యుగాలను తలపింప జేస్తున్నది. పత్రికటనలు, సినిమా, రేడియో అన్నీ మారినా విశ్వవిద్యాలయాలు మాత్రం మారడంలేదు. నిలువ నీటిగుంటలుగా చాదస్తపు పండితులు దోమల సంగీతం వినిపించినట్లు గ్రాంధికాంధ్రంలోని రచనల్ని మాత్రమే పాఠ్యాంశాలుగా నిర్ణయిస్తున్నాయి. ఈ పద్ధతి మారాలని విరసం కోరుతున్నది.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వాడుకభాషను ప్రవేశపెట్టే విషయం ఆమోదింపబడిన తరువాత కూడ కొందరు నయవంచకుల కుట్రఫలితంగా విద్యార్థులు పరీక్షలలో తమ జవాబులను వాడుకభాషలోగాని, గ్రాంధిక భాషలోగాని రాయవచ్చుననే సవరణను ప్రతిపాదించి తమమాటను నెగ్గించుకున్నారు. ఈ పద్ధతి అర్థరహితం. వర్తమాన

యుగావసరాలను ప్రతిబింబించే విధంగా భావతాస్వేచ్ఛ ప్రభావవర్గం కాకుండా, విద్యార్థులు పూర్తిగా వాడుకభాషలోనే రాయటాన్ని అంగీకరించమని విరసం కోరుతున్నది.

శిష్టవ్యావహారిక మనేమాట విడ్డూరమైనది. ప్రజలు నిత్యకృత్యాల్లో వాడుకునే జీవద్భాషలోనే రచయితలు రచనలు చేస్తున్నపుడు విద్యాలయాలు వీటిని ఏమీ షరతులు లేకుండానే పాఠ్యాంశాలుగా తీసుకోవాలి. అప్పుడే గురజాడ గిడుగులు ఆశించిన భాషావిప్లవం సఫలమవుతుంది.

విశ్వవిద్యాలయాలు అన్నిస్థాయిలలోనూ వాడుకభాషను స్వీకరించాలని విప్లవ రచయితలసంఘం డిమాండు చేస్తున్నది.

## 4 డా॥ యం. వి. రమణారెడ్డి అరెస్టు-ఖండన.

ప్రభంజం సంపాదకుడూ కార్మిక నాయకుడు, రచయిత అయిన డా॥ యం. వి. రమణారెడ్డిని 1971 నుండి వరసగా ఏదోఒక సాకుతో నేరారోపణలుచేసి కారాగారంలో బంధించడం మామూలైంది. కొన్ని నెలల క్రితం మదనపల్లిలో వ్యక్తిగత తగాదాల వల్ల ఇద్దరు కార్మికులు కొట్టుకోవడం వల్ల ఒక కార్మికుడు మరణిస్తే అందుకు రమణారెడ్డి గారిని హత్యా స్థలంలో లేకపోయినప్పటికీ నేరారోపణచేసి జైల్లో కుక్కారు- ఆ కేసులో బెయిల్‌మీద బయట కొచ్చిన కొద్ది రోజుల్లోనే మరోహత్యా నేరం మోపి ప్రస్తుతం కమలాపురం సబ్ జెయిల్లో నిర్బంధించారు. ఇదంతా అక్కడి ఇందిరా కాంగ్రెస్‌కు కొమ్ముగాసే యజమానులు పోలీసులు కుమ్మక్కయి చేస్తున్న కుట్ర మాత్రమే. డా॥ యం. వి. ఆర్‌ని నిర్బంధించి కార్మికోద్యమంలో చీలిక తేవడానికి పాలక వర్గాలు సంవత్సరాలుగా వ్యర్థ ప్రయత్నాలు చేస్తున్న విషయం లోకవిదితమే.

డా॥ యం. వి. ఆర్. బయట వుండి ఈ పరిమిత స్వేచ్ఛా వాయువులను పీల్చుకోవడానికి కూడా, స్థానిక యజమానులకు, ఇందిరా కాంగ్రెస్ ముఠాకు పోలీసులకు ససేమిరా యిష్టం లేదులావుంది.

తూర్పు ఎర్రబడుతుంటే వాకిళ్ళు మూసుకొంటున్నట్టు యం.వి. ఆర్‌ను చీకటికొట్లలో కుక్కుతున్నారు.

అసత్య, అసంబద్ధ హత్యారోపణలు ఉపసంహరించుకొని, కార్మిక నాయకుడయిన డా॥ యం.వి. ఆర్‌ని విడుదల చెయ్యాలని విరసం డిమాండు చేస్తున్నది.

## 5. తీవ్రతరమవుతున్న ప్రభుత్వ నిర్బంధ విధానాలను ప్రతిఘటించండి

అసమానతలను అరికట్టలేని ప్రభుత్వం అసంతృప్తిని అణచి వెయ్యటానికి ప్రయత్నించటం పాలకవర్గాల సాంప్రదాయం. అందులో భాగంగానే వచ్చిన 'ఎమర్జెన్సీ'ని ఎత్తివేసిన తర్వాత కూడా ఈ ధోరణి కొనసాగటాన్ని విరసం ప్రజల దృష్టికి తెస్తోంది.

కేంద్రంలో ఆంతరంగిక భద్రతా చట్టాన్ని ఉపసంహరించుకొన్న జనతా ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలని అదే చట్టం మళ్ళీ చెయ్యమని ప్రోత్సహిస్తోంది. షా కమీషన్ రిపోర్టుపై తగు చర్యలు తీసుకోకపోవటమే గాక, ప్రత్యేకించి ఆ కమీషన్ రహస్య పోలీసు విభాగాలపై చేసిన వ్యాఖ్యానాలను తొక్కిపెట్టడానికి ప్రయత్నిస్తున్నట్లు కూడా కన్పిస్తోంది. తన కమీషన్‌ని తనే బూటకంగా మారుస్తోంది. కార్మికులపై, వ్యవసాయ కూలీలపై, హరిజన గిరిజనులపై పోలీసు దాడుల్ని తీవ్రతరం చేస్తోంది.

ఈ విషయంలో కేంద్రం వరవడిని తీసుకొని రాష్ట్ర ప్రభుత్వాలు ఒకదానితో ఒకటి పోటీ పడుతూ ప్రజలపై, ప్రజా హక్కులపై దాడి చేస్తున్నాయి. చివరకి వామపక్ష ప్రభుత్వంగా ప్రకటించుకున్న బెంగాల్ ప్రభుత్వం బంకురా, బిక్రమ్‌పూర్ ప్రాంతాల్లో 1970ల నాటి నిర్బంధాన్ని పునరావృతం చేస్తోంది. ఈ విషయంలో ఎప్పుడూ అగ్రస్థానంలోనే వున్న ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం, చెన్నారెడ్డి హయాంలో మరింతగా పుంజుకుంటోంది. అధికారానికి వచ్చిన ఆరు నెలల కాలంలోనే వరంగల్, కరీంనగర్, ఆదిలాబాద్, విశాఖ, కొత్తగూడెం, హైద్రాబాద్, సికింద్రాబాద్ ప్రాంతాల్లో అనేక మార్లు జరిపిన పోలీసు కాల్పులు ,అత్యధిక మెజారిటీ' వెనకవున్న బలహీనతని ప్రదర్శిస్తోంది. ఆంధ్ర ప్రదేశ్‌లో పి.డి. చట్టంలోవున్న ప్రత్యేక ప్రొవిజన్‌లు దాని నిర్బంధ విధానానికి సూచనలు. నక్సలైట్లపై పోలీసులు సాగించిన హత్యల గురించి విచారణకి నియమించిన భార్గవ కమీషన్‌ను హత్య చెయ్యటమూ, ముక్తధర్ కమీషన్ పోలీసు వ్యవస్థపై చేసిన వ్యాఖ్యానాలను రుజువుచేస్తూ కమీషన్ తీర్పును తల్లకిందులు చెయ్యడానికి ప్రయత్నించడమూ, రాష్ట్రంలో జరుగుతున్న ఆందోళనలకూ, నక్సలైటు రాజకీయాలకూ ముడిపెట్టి తూర్పుగోదావరి జిల్లాలో రంపచోడవరం, కొండమొదలు వగైరా ప్రాంతాలలో ప్రభుత్వం సాయుధ పోలీసు శిబిరాలను పెట్టడమూ జరుపుతూన్న నిర్బంధానికి దాఖలాలు. 1972-75 కాలం మాదిరిగా క్రమక్రమంగా బలపడుతున్న ఈ ప్రజా వ్యతిరేక ధోరణులను ప్రతిఘటించ వలసిందిగా విరసం ప్రజాస్వామిక వాదులందరికీ విజ్ఞప్తి చేస్తోంది.

6. కృష్ణన్ చెట్టి వురితీత

ఉరి తీయబడ్డ కృష్ణన్ చెట్టి నక్సలైట్ ఖైదీ కాదని ప్రకటించిన తమిళనాడు ప్రభుత్వం అసలు ఉరితీయబడ్డ ఖైదీ ఏ కేసులో ఉరితీయబడ్డాడో తెలియజేయకుండానూ వైనాడు అడవుల్లో భూస్వాములనూ, వడ్డీ వ్యాపారస్తుణ్ణి హత్యచేసిన కేసులో ఉరిశిక్ష విధించబడిన ఖైదీ పరిస్థితి ఏమయిందో తెలియజేయ కుండానూ, ఎవరు నక్సలైటు ఖైదీలో, ఎవరు కారో నిర్ణయించే అధికారాన్ని తనకు తాను ఆపాదించుకుంటోంది. తమిళనాడు మానవ హక్కుల సంఘం కార్యదర్శి శ్రీ భక్తవత్సలం ఒక ప్రకటనలో, ఉరితీయబడిన కృష్ణన్ చెట్టి నక్సలైటేనని ప్రభుత్వం తన చర్యలను దాచుకోవడం కోసం ప్రజలలో గందరగోళం సృష్టిస్తోందని ఆరోపించారు.

ఈ విషయంపై జనతా ప్రభుత్వ మౌనాన్ని విరసం ఖండిస్తూ నిజాన్ని బయట పెట్ట వలసిన బాధ్యత తనపై వుందని కేంద్ర ప్రభుత్వాన్ని హెచ్చరిస్తోంది.

కృష్ణన్ చెట్టి ఉరిశిక్షను విరసం ఖండిస్తూ, శిక్షాస్మృతి నుండి ఉరిశిక్షను తొల గించాలని డిమాండ్ చేస్తోంది.

7. విద్యార్థులపై పోలీసుల లాఠీ చార్జిపై ఖండన

సెప్టెంబరు నెలలో సాంఘిక సంక్షేమ విద్యార్థుల సమస్యలను పరిష్కరించమనీ, రాష్ట్ర మహిళా సంక్షేమ మంత్రి రోడామిస్త్రీ స్త్రీలపట్ల చేసిన సిగ్గులేని, అభ్యంతరకర ప్రకటనను ఖండిస్తూ ఆమెను బర్తరఫ్ చేయాలనీ, హైదరాబాద్ లో విద్యార్థులు అసెంబ్లీ ముందు శాంతియుతంగా జరిపిన ప్రదర్శనను చెదరగొట్టి, ప్రదర్శకులపై విచక్షణా రహితంగా జరిపిన లాఠీచార్జీ బాష్పవాయువును ప్రయోగించిన పోలీసుల కిరాతకాన్ని, ప్రభుత్వ దమననీతిని విరసం తీవ్రంగా ఖండిస్తోంది.

8. మట్కా, వర్లీ జూదాలు

ఆంధ్రప్రదేశంలోని దాదాపు అన్ని పట్టణాలలో, పట్టణ పరిసర ప్రాంతాలలోని పేద, కార్మిక, మధ్యతరకం ప్రజల సంపాదనలో కొద్ది భాగాన్నైనా దోపిడీ చేస్తున్న "వర్లీ" జూదాన్ని (మట్కా జూదాన్ని) దానికి ప్రోత్సాహాన్నిస్తున్న పోలీసు వర్గాన్ని నిరసిస్తూ, ఈ జూదాన్ని అరికట్టాలని విరసం డిమాండు చేస్తోంది.

9. మీసా డిటెన్యూల నందరినీ ఉద్యోగాల్లోకి తీసుకొని వారికివెంటనే డిటెన్షన్ కాలపు జీతాన్ని పూర్తిగా చెల్లించాలి.

ఎమర్జెన్సీ ఎత్తివేసి ఏడాదిన్నర గడచినప్పటికీ ఆకాలంలో డిటెన్షన్‌లో పెట్టిన విరసం సభ్యుడు చెరబండరాజు మొదలయినవారిని తిరిగి వుద్యోగాల్లోకి తీసుకోక పోవడం రాష్ట్రప్రభుత్వ విచక్షణా విధానానికి నిదర్శనం- అట్లాగే కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు డిటెన్షన్ పీరియడ్‌ను పనిలోఉన్నట్లుగా భావించి పూర్తిజీతం యివ్వాలని ఆదేశాలు ఇచ్చినా, ఇప్పటికీ విరసం సభ్యులు త్రిపురనేని మధుసూదనరావు, ఎం. టి. ఖాన్, కె. కనకయ్య మొదలయిన వారికి ఆ కాలపు పూర్తి జీతం చెల్లించలేదు.

రంపచోడవరం కేసులో ముద్దాయిగావున్న శ్రీ శ్యామసుందరరావును 1971 లో వుద్యోగం నుంచి తీసివేశారు- ఆ కేసులో ఆయన నిర్దోషిగా కోర్టు తీర్పు చెప్పినప్పటికీ ఆయన నింకా వుద్యోగంలోకి తీసుకోలేదు.

చెరబండరాజు, శ్యామసుందరరావులను వెంటనే వుద్యోగాల్లోకి తీసుకోవాలని, పూర్తి జీతాలు చెల్లింపబడని మీసా డిటెన్యూలకు జీతాలు చెల్లించి కేంద్రి రాష్ట్రి ప్రభుత్వాల ఆదేశాలు వెంటనే అమలు చేయాలని విరసం డిమాండు చేస్తున్నది.

10 (a) సంతాప తీర్మానాలు

సౌభద్రుని ప్రణయ యాత్ర, జన్మభూమి, భాగ్యనగర కోకిల కావ్యాలతో తెలుగు సాహిత్యంలో ఒక విశిష్టమైన స్థానాన్ని పొందిన శ్రీ నాయని సుబ్బారావు మరణంపట్ల, ప్రయోగవాదంతో బాటు ప్రయోజన పరత్వాన్ని వ్యక్తి వేదనతో బాటు సమాజ చింతననూ సమన్వయింప జేసిన శ్రీ ఆలూరి బైరాగి మరణంపట్ల విరసం తన గాఢ సంతాపం ప్రకటిస్తూంది.

(b) డాక్టర్ కోవూర్ మృతికి సంతాపం

"మతం మానవుల పాలిటి మత్తుమందు" అన్నాడు మార్క్సు- అత్యున్నత హేతువాదమైన మార్క్సిజాన్ని డా॥ కోవూర్ స్వీకరించనప్పటికీ, మూఢ విశ్వాసాలకు వ్యతిరేకంగా జీవితమంతా పోరాడినదుంకు విరసం అభినందిస్తోంది- మానవాతీత శక్తులు, మహిమలు లేవనీ, బాబాలు, అమ్మల ఇంద్రజాల మహేంద్రజాలాలు కేవలం గారడీలేననీ శాస్త్రీయంగా నిరూపించినందుకు విరసం నివాళులర్పిస్తూ, డా॥ కోవూర్ మృతికి శ్రద్ధాంజలి ఘటిస్తోంది.

# ఎన్ ఎస్ ఎస్ తలపెట్టిన వయోజన విద్య వయోభారమా? నిష్ప్రయోజనమా?

కేంద్రంలో జనతా ప్రభుత్వము వందలకోట్ల రూపాయలు కేటాయించి మన రాష్ట్రంలో విశ్వవిద్యాలయాలలు ఎన్ ఎస్ ఎస్ ద్వారా అమలు చేయదలిచిన వయోజన విద్య వయోభారమైతే కావచ్చు కాని నిష్ప్రయోజనం మాత్రం కాదు. దానికి కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాధికారాల్లోవున్న పాలకవర్గాల నిర్దిష్ట ప్రయోజనాలున్నాయి- అనుభవం ద్వారా, పోరాటం ద్వారా వయోజనులు నిజమైన చదువులు చదువుకుంటారనే భయంతో మత్తు మందు చదువులు నేర్పడం వయోజన విద్యా పథకం ప్రయోజనం.

ఇంతకూ భారతదేశంలో విద్యరాని వయోజనులు ఎవరు? ప్రధానంగా గ్రామీణ రైతాంగం. తర్వాత పట్టణాల్లో మురికివాడల్లో నివసించే రెక్కల కష్టం చేసే జనం కనుక వీరికి విద్య వీరి జీవితాలకు సంబంధించిందై వుండాలి. అంటే గ్రామాల్లో వయోజనులకు ప్రధానంగా వ్యవసాయ సంబంధమైన విద్య, భూమి సమస్యలను, భూ సంబంధాలను అర్థం చేసుకోగల విద్య యివ్వాలి- గ్రామాల్లో నిజమైన వయోజన విద్య అంటే ఈ వ్యవస్థ యింకా భూస్వామ్య వ్యవస్థగా వున్నది కనుక తాము దోచుకోబడుతున్నామని అది తమ కర్మయో, ప్రాప్తమో కాదని ప్రజలు గ్రహించగలిగేదిగా వుండాలి. అట్లాగే పట్టణాల్లో సామ్రాజ్యవాద దోపిడీని కార్మికులర్థం చేసుకోగలదిగా వుండాలి- ఇటువంటి శాస్త్రీయ విద్యావిధానాన్ని యీనాడున్న వ్యవస్థనుంచీ ప్రభుత్వాల నుంచీ ఆశించడం అశాస్త్రీయం. ఈ చదువులు కనీసం గ్రామీణ జీవితంతో పరిచయమున్నవిగా జిజ్ఞాసను పెంచేవిగా వున్నాయా అన్నదైనా చూద్దాం.

మొదటి విషయం పల్లెల్లో ఐనా పట్టణాల్లో అయినా ప్రైమరీ (ప్రాథమిక) స్థాయి వుపాధ్యాయుడు మాత్రమే ఎంతో కొంత నిరక్షరాస్య వయోజనుల మనస్తత్వాన్ని అర్థం చేసుకోగల్గుతాడు- ముఖ్యంగా పల్లెటూరి బళ్ళల్లో ఓపికవున్న ప్రైమరీ స్కూల్ టీచరుకిది సాధ్యమౌతుంది- కాని కాలేజీ ఎన్. ఎస్. ఎస్. విభాగాలు ఈ కార్యక్రమాన్ని చేపట్టడం దీని తీవ్రమైన అవసరాన్ని అర్థం చేసుకోకపోవడమే. తమ పరిమితులనూ, అర్హతలనూ గుర్తించక పోవడమే. బాల శిక్షలైనా విశ్వనాథ సత్యనారాయణ గారి లాంటి పండితులే రాయగలరన్న 'సర్వజ్ఞ' భావం నుంచి వచ్చిన తప్పుడు ఆలోచన యిది. వయోజన విద్య యిప్పటికే ఆ రంగంలో చిత్తశుద్ధితో కృషిచేస్తున్న సంస్థలూ, వ్యక్తులు చేపట్టవలసిందే కాని ఎన్.ఎస్.ఎస్. చేపట్టడం అనేది మన యితర రంగాలలోని పథకాల లాంటిదే. ఒక నాన్ సీరియస్ కన్నీటి తుడుపువంటి తాజా కపట నాటకం మాత్రమే.

ఉస్మానియా విశ్వవిద్యాలయం జాతీయ సేవాపథకం వారు వయోజన విద్యా వాచకాన్ని ప్రచురించారు- అవిద్యాపరులను విద్యావంతులను చేసి మన ప్రజలను సరియైన పంథాలో నడిపించడానికి దేశాన్ని ఒక కొత్తమలుపుకు తిప్పడానికి ఈ వాచకం వుపయోగం కాగలదని ముందుమాట రాసిన డాక్టర్‌గారభిప్రాయపడ్డారు- ఈ పుస్తకం తయారు చేసింది సివిలింజనీరింగ్‌లో డాక్టరేట్ పొందిన ఒక వున్నత విద్యావంతుడు.

ఆయన 'మనవి'లో 'ఒక విధంగా చూస్తే బీదరికం విద్యాలేమి ఈ రెండూ ఒకదాని నొకటి అంటిపెట్టుకున్న జాడ్యాలేమో ననిపిస్తుంది' అని గుర్తిస్తూనే 'మూర్ఖత్వాన్ని సమూలంగా నాశనం చెయ్యాలన్నా ప్రజలను కర్తవ్య నిర్వహణవేపు మళ్ళించాలన్నా విద్యావ్యాప్తి ఒక్కటే మార్గమని' అంటూ 'పౌరుల మనుగడ'కు ఈ వ్యవస్థలోని అసమానతలు గాక 'నిరక్షరాస్యతయే' (ఇక్కడ విద్య అనిగానీ చైతన్యం అనిగానీ వాడలేదు- గుర్తించాలి) కారణమని ప్రజాస్వామ్య ప్రభుత్వంలో నిరుపేదలు వుండడం సహజమే నన్నట్లు వాళ్ళకు 'వయోజన విద్యమాత్రం హక్కుగా గుర్తించా'లని అంటున్నాడు- మరి వయోజనవిద్య అంటే కేవలం చదవడం రాయడం మాత్రమే కాదని ప్రజను సమాజాన్నీ పరిస్థితినీ అర్థం చేసుకొని తమ జీవితావసరాలకు వాటిని సమర్థవంతంగా వినియోగించుకోగల తెలివి తేటలు పొందగల్గా'లని 'యీ వయోజన విద్యా కార్యక్రమంలో అక్షరాస్యత ఒక ముఖ్య భాగం ఐనప్పటికీ ప్రజల్లో స్పృహా చైతన్యం రేకెత్తించడం అవసరం' అంటాడు- 'అంతేకాదు ఈ కార్యక్రమంలో పాల్గొనే బోధకులకు మంచి శిక్షణ ఎంతో అవసరం.' (ఎన్. ఎస్. ఎస్. తలపెట్టిన ఈ పథకంలో నిరుపేద, నిరక్షరాస్య వయోజనులతో సంబంధంలేని కాలేజ్ టీచర్లకు ఏ ప్రత్యేకమైన మంచి శిక్షణ యిచ్చి యీ కార్యక్రమానికి పూనుకున్నారో వూహించవలసిందే.) 'స్నేహశీలత' మాత్రమే కాకుండా యీ వుపాధ్యాయుల నుండి 'సమతా దృక్పథాన్ని' ఆశిస్తున్నాడు రచయిత.

యీ పుస్తకం ప్రజల్లో ఎటువంటి 'స్పృహనూ చైతన్యాన్ని రేకెత్తిస్తుందీ' ప్రజలూ 'సమాజాన్ని పరిస్థితులను అర్థం చేసుకొని తమ జీవితావసరాలకు వాటిని సమర్థవంతంగా వినియోగించుకోగల' విధంగా యిది వుందా అన్నం మెతుకుబట్టి చూసినట్టుగా కొంచెం పరిశీలిద్దాం.

పుస్తకం అట్టమీదనే (కందీలు) దీపం దగ్గర చదువుకొంటున్న స్త్రీ పురుషుల బొమ్మలున్నాయి. అతడి చేతిలో పుస్తకంలో అ, ఆ, ఇ కనిపిస్తున్నాయి. అతడు చెప్తున్న వాడో చదువుతున్నవాడో తెలియదు- కాని ఆమె మాత్రం పలక మీద రాయ

బడిన ఒ న ల లో ఒ ను దిద్దుతున్నది. అక్షరాలను ఓనమాలని అక్షరాలు నేర్ప డాన్ని ఓనమాలు నేర్పడమని వాడుకలో వున్న మాట నిజమే. దీనికున్న సాంప్రదాయ ప్రాతిపదిక ఓం నమః (శివాయ) తో ప్రారంభించి అక్షరాలు పెట్టించడం. కాని ఎక్కడా ఒన అని మాత్రం పెట్టించి, అక్షరాలు నేర్పడం ప్రారంభించరు. పాత పద్ధతుల్లోనైతే ఓం అని గానీ (ఈ పుస్తకంలో పలక అనే మాట పరిచయం చేయ డానికి పలక బొమ్మ వేసి దానిపై ఓం అనే మాటను కూడా అచ్చేశారు. అంటే ఈ సివిలింజనీరు డాక్టరుగారికి యిప్పటికీ అక్షరాలు ఓంకారంతో ప్రారంభించాలని 'శాస్త్రీయ' దృక్పథం వున్నది.) (సెక్యులర్ దేశంలో!)

ఈ పుస్తకంలోని కొన్ని బొమ్మల గురించి చెప్పుకోవాలి. నిజంగానే రచయిత దృష్టిలో నిరుపేద వయోజనులే వున్నారా? ఉదాహరణకు ఊయల వుంది. వయో జనుల పరిచయంలో ఊయల వుంది. అది పసిపాపలను వూపడానికి కట్టే బట్ట ఊయల లేదా పిల్లలు చెట్లకు కట్టుకొని వూగే తాటి ఊయల, కాస్త ఒకతీరు బ్రతుకు తెరువు గలవారు వుపయోగించే నులక చెక్కతొట్టె లాంటి ఊయల కాని, రచయితకు తెల్సింది మాత్రం అల్లసాని పెద్దన 'ఊయల'. చక్కటి బల్లచెక్క ఊయల. అసలీ ఊయల అంత పెళుసు కొమ్మ కెట్లా నిలుస్తుందా అన్నది బొమ్మ చూస్తే తప్ప కలగర ఆశ్చర్యం.

'ఏ' ను ఏరు బొమ్మతో పరిచయం చెయ్యొచ్చు. ఏరు గ్రామీణ వ్యవసాయ జీవి నిత్య జీవితంలో వున్నది. కాని రచయిత దృష్టికి తెలుగు దేశంలో సర్కస్‌లలో తప్ప, జంతు ప్రదర్శన శాలల్లో తప్ప కనిపించని ఏనుగు తప్ప అనదు.

గంట బొమ్మ మీద హనుమంతుని బొమ్మ ఎందుకు? వయోజనులకు అవసని మైన ఎద్దు మెడలోని గంటకో లేదా రాత్రి బడి గంటకో హనుమంతునితో వున్న సంబంధం ఏమిటి? 'జ' తో జనుములు కానీ జల్లెడలు కానీ పరిచయం చేయవచ్చు కాని ధర్మ చక్రాంకితమైన 'జండా' ను వదిలి ఎన్ ఎస్ ఎస్ వాళ్ళు ఆ పని చేయ గలరా?

'ఓలి' అనే మాట కన్యాశుల్కమట ఇది మాండలికం ఐవుండాలి. నాకు తెల్సి నంతవరకు ఇది తెలంగాణాలో లేదు. 'గద' లు మనకు వున్నాయా? 'టముకు' పక్కనే ఆ మాటకే సమానార్థకం అయిన డప్పు వేయవచ్చు. 'ద' తో మోటదందెడ చెప్పవచ్చు గదా। దరువు చెప్పవచ్చు కదా।

'యతి' ఎక్కడున్నాడండీ? వయోజనుడు యంత్రం గురించి తెలుసుకోవాల్సిన అవసరం లేదా? 'యజ్ఞము,' 'యజుడు' వీటిని వాళ్ళ నిత్య జీవితాల్లో ఎట్లా అనుభవానికి తెస్తారు? పోలీసు రాజ్యం వున్నంత కాలం 'యముడు' సుపరిచితుడే- 'రత్నం' ఎలా వుంటుంది? కమలం మీద నిల్చిన నాలుగు చేతుల 'లక్ష్మి' వయోజనులకు వాళ్ళ జీవితావసరాల్లో సమర్ధవంతంగా వినియోగించు కోవడానికి నాలుగు చేతులా డబ్బు యిస్తుందా? అట్లాగే నాలుగు చేతుల సరస్వతి దానికంటె 'స' తో సజ్జలు నేర్పవచ్చు కదా! రచయిత ఆశించిన సమత నేర్పవచ్చు కదా? 'హంస' లే వూళ్ళో వున్నాయి? 'శమి' అంటే వయోజనులకు తెలుసా? సామాన్యంగా వయోజనులకు చేప్పే మాటలు అక్షరాలు రాకపోయినా బొమ్మ చూస్తేనో, వినిపిస్తేనో వెంటనే అర్థం అయ్యేవై వుండాలి. కొన్ని మాటలను రచయితే చెప్పినట్లుగా సమాజాన్నీ పరిస్థితుల్నీ అర్థం చేసుకోవడానికి, జీవితావసరాల్లో వినియోగించుకోవడానికి' నేర్పవలసి వుంటుంది- ప్రజలతో నడుస్తూ ప్రజలను ఒక అడుగు ముందుకు వేయించేదిగా వయోజన విద్య వుండాలి- బొమ్మలు చూడగానే వయోజనుడు చత్రి, గొడుగు అనే మాటలకు 'చత్రిము' అని, చూడగానే కళ్ళు మిల మిల మెరిపిస్తూ నోటి నిండా చేప అనే చోట 'ఝషము' అని పరిచయం చేస్తే ఎట్లా వుంటుంది- నెమళ్ళే అరుదైన చోట నెమలిని 'బర్హి' గా పరిచయం చేస్తే ఎట్లా? నిరుపేద వయోజనులకు ఈ పుస్తకం ఎంత అందమైన 'నగ' ను వుచితంగా యిస్తుంది. నూటికి 80 మంది గ్రామీణ వయోజనులు చూసి వుండని పొయ్యి యిందులో వుంది- యింటింటికీ మంటి పొయ్యి అన్న అర్థవంతమైన సామెతైనా తెలిసి వుంటే యిటువంటి అవాస్తవిక బొమ్మ లుండవు- అ మన వయోజనులకు కూడా నేర్పవలసిందేనా ?

దర్జీ, నర్సు అని రాసిన చోట్ల ఆ పనులు స్త్రీలవే అన్నట్టు, డాక్టర్ అంటే కోటూ పై కట్టుకొని వయోజనులకు అందుబాటులో లేని ఒక దొరబాబైనట్లు పరిచయం చేయడం ఈ పుస్తకానికి తగినట్లుగా వుంది- ష ఒత్తు నేర్పడానికి 'రత్నము' 'గవర్నరు' 'దున్నపోతు' లు గుర్తొచ్చాయి గాని రచయితకు 'అన్నము, జొన్నలు' గుర్తు రాలేదు- 'సూర్యుడు'. 'చంద్రుడు' అసంఖ్యాకంగా లభిస్తున్న ఫోటోల్లోంచి వేసి పరిచయం చేయలేరా ? 'బలిపాటు' అనే మాట నేర్పడంలో రచయిత మనస్సులో శకునం వుంది.

తెలుగు నెలలు గానీ ముఖ్యంగా రైతు జీవితంలో భాగమైన ఋతువుల పరిచయం గానీ లేదు- కొలతలూ, తూకాలూ, కాలం పరిచయం చేసేప్పుడు ఇప్పటికీ

## పుస్తకాల గురించి

మేక్సిం గోర్కీ

నాలోని మంచి కంతటికీ కారణం పుస్తకాలు. మనుషుల కంటె కళే మరింత వుదారంగా వుంటుందని యువకుడుగానే నేను గ్రహించాను. నేను పుస్తకం ప్రేమిని. అది ప్రతి ఒకటీ నాకు పరమాద్భుతం అనిపిస్తుంది. గ్రంథకర్త మాంత్రికుడిలా కని పిస్తాడు. ప్రగాఢమైన భావోద్రేకంతో, సంతోషభరితమైన వుత్సాహంతో తప్ప నేను పుస్తకాల గురించి మాట్లాడలేను. హాస్యాస్పదం అనిపించవచ్చు గాక, ఇది నిజం. ఒకానొక అనాగరకుడి వుత్సాహం లెమ్మని అంటారేమో, అననీ. నాది నయం గాని వ్యాధి.

ముద్రణాలయంలో టైపు-సెట్టరు తన తరహాలో తానొక వీరుడై, మరో వీరుడు కనిపెట్టిన యంత్రం సాయంతో తయారుచేసే కొత్త పుస్తకాన్ని నా చేతుల్లో పెట్టుకున్న ప్పుడు, ప్రాణవంతమైనదీ అద్భుతమైనదీ నాతో మాట్లాడ గలిగేదీ ఏదో నా జీవితంలో ప్రవేశించిందన్న భావం కలుగుతుంది నాకు- ప్రపంచంలో దేనికంటె కూడా మరింత జటిలమైన జీవి, పరమ అగమ్యగోచరుడు, అతి ప్రేమపాత్రుడు, గొప్పతనంతో చక్క దనంతో తొణికిసలాడే ప్రపంచంలో ప్రతీ వస్తువునీ తన శ్రమతో వూహాశక్తితో సృష్టించిన వాడు, మనిషి, తన గురించి తాను రచించుకున్న కొత్త పవిత్ర గ్రంథం.

---

జనంలో ఎక్కువగా ప్రచారంలో వున్న గజమూ సేరు (యింకా కొన్నిచోట్ల సోల. తవ్వ, కుంచం, తక్కెడు) మొదలైన ప్రమాణాలను పరిచయం చేసి ప్రవేశ పెట్ట దల్చుకొన్న దశాంశ పద్ధతులకు సరిచేసి చెప్పవద్దా? ముఖ్యంగా కరపత్రంలో ఆమడ అనే మాటను పరిచయం చేస్తూ-

'ఇది వెనకటి లెక్క, ఈనాడు దూరాన్ని కిలో మీటర్లలో కొలుస్తున్నారు. మైళ్ళ లేక్క కూడా పాతదే.'

గ్రామాలలో ఈ మాటలు, యింకా వివాదాస్పదమే 'ఎకరం పాత లెక్క హెక్టార్ కొత్త లెక్క' అని కూడా తేల్చివేశాడు. వయోజనులకు విద్య నేర్పవలసిన ఎందరు ఈ పాత లెక్కలను కొత్త లెక్కలతో సరిపోల్చి చెప్పగలుగుతారు?

---

ఉస్మానియా వయోజన విద్యావాచకంతోపాటు బోధకుల కొరకు
తయారు చేయబడిన 24 కరపత్రాల గురించి వచ్చే సంచికలో-

బాధకుల కొరకు కర్ర బెత్తాలు.

జీవితం గుండా నాకు దారిచూపి నడిపించేవి పుస్తకాలు. జీవితం గురించి నాకు బాగానే తెలుసు గాని, మనిషిలో లోగడ నాకు తెలియని, నేను గమనించని, కొత్తదాన్నేదో ఇవి నాకు తెలియ జెప్పుతుంటాయి. మొత్తం పుస్తకంలో ఒకే ఒక్క పటుతరమైన వాక్యం కంటె ఎక్కువ నీకు కనిపించకపోవచ్చు గాక, ఈ ఒక్క వాక్యమే నిన్ను మనిషికి దగ్గరగా వెళ్ళేట్టు చేస్తుంది, ఒక కొత్త చిరునవ్వునీ ఒక కొత్త చిడిముడి పాటునీ నీకు తెలియపరుస్తుంది.

నక్షత్ర లోకాల గొప్పదనం, మహావిశ్వానికిగల సమ్మేళనాత్మకమైన యంత్రాంగం, ఎంతో వుపన్యాస ధోరణిలో జ్యోతిశ్శాస్త్రమూ ప్రపంచ వుత్పత్తి విషయమూ చెప్పేదేదీ నన్నుకదిలించదు, నాలోవుత్సాహాన్ని కెరలించదు. జ్యోతిశ్శాస్త్రజ్ఞులు మనల్ని నమ్మింప జేసేంతగా ఈమహావిశ్వం విస్మయవంతం కాదని, ప్రపంచాల చావుపుట్టుకలో దైవ కల్పితమైన సమ్మేళనకంటె అర్థరహితమైన అరాజకమే హెచ్చని నావూహ.

అంతుపొంతులేని పాలపుంతలో ఎక్కడో ఒకసూర్యుడు ఆరిపోయి, దానిచుట్టూ వున్న గ్రహాలు శాశ్వత అంధకారంలో మునిగిపోయాయి. సరేగాని ఇవేవీనన్ను కొద్దిగానైనా కదిలించవు- కాని, గొప్ప వూహాబలం కలిగిన కేమిల్ ఫ్లామారియన్ మరణంనాకు దురంతమైన దుఃఖాన్ని కలిగిస్తుంది.

చూడముచ్చటగా సొగసుగా మనకు కనిపించేదంతా మనిషి కల్పించిందో వూహ గుచ్చిచెప్పిందో. డాస్టోయేవ్‌స్కీ, బాద్‌కర్ వంటి వారిలాగా ఆతగాడు తరచు బాధను కూడా సృష్టించవలసి రావడం, దాన్నిఅతిశయం చేయవలసి రావడం, విచారకరం.

మనచుట్టూవుండి శత్రుభావం చూపెట్టే ప్రకృతిలో ఏఅందమూలేదు; అందమనేది మనిషి తన హృదయాంతరాళంనుంచి సృష్టిస్తే యేర్పడిందే. ఫిన్లాండు మనిషి తనచిత్తడి నేలల్నీ అడవుల్నీ వుండీవుండని మరుగుజ్జు చెట్టుచేమలతో గూడిన తుప్పారంగ బంద్రాతినీ రమణీయ దృశ్యాలుగా వూహతో మార్చుకుంటాడు. ఎడారి అందంగానే వుందని అరబ్‌దేశస్థుడు తనకుతానే నమ్మించుకుంటాడు. సౌందర్యం గురించి మనిషి ఆలోచించినప్పుడే అదిపుడుతుంది. ఇష్టవచ్చినట్టు పడివున్న పర్వతాలనుచూచి నేను సంతోషించను. వాటికిమనిషి సమకూర్చి పెట్టిన వైభవంచూచి సంతోషిస్తాను. మనిషి వీరుడు. అలా కాకుండావుంటే, భూకంపాలతో తుఫాన్లతో మంచువర్షాలతో వరదలతో అత్యుగ్ర శీతోష్ణాలతో, క్రిమికీటకాలతో సూక్ష్మజీవులతో జీవితం పరమ దుర్భరంగా వుండేది. ఆలోచించిచూస్తే, ఈ ప్రపంచం సుఖజీవనానికి తగింది కాదు-

భూమి మీద పుట్టి పెరిగిన మనిషిలో ఎంతవుదాత్తతవుందో! అవలీలంగా మహావుదాత్తంగా అతడు ప్రకృతిని మార్చివేస్తున్నాడు. దీన్ని నేను అద్భుతమని అనుకుంటాను.

మన మనుగడ ప్రతిచోటా సర్వదా విషాదకరంగానే వుంటూవచ్చింది. అయితే లెక్కలేనన్ని ఈవిషాద విషయాలను కళాఖండాలుగా మార్చుకున్నాడు మనిషి. ఈ పరివర్తనకంటె ఆశ్చర్య కరమైన, అద్భుతావహమైన విషయం నాకుమరేదీ తెలియదు. చుక్కల కనుసైగల్లో, సముద్రాల లయలో, అరణ్యాల గలగలలో, నిర్జనస్థలాల నిశ్శబ్దంలో కనిపించేంతకంటె ఎక్కువ వివేకమూ ప్రాణవంతమైన సౌందర్యమూ నాకు పుష్కిన్‌కావ్యాల పుస్తకంలోనో ఫ్లాబర్ట్ నవలలోనో కనిపించడం ఇందుచేతనే.

నిర్జన స్థలాల నిశ్శబ్దమా? రష్యన్ వాగ్గేయకారుడు బొరోడిన్ తన కృతులలో ఒక దానిలో దీన్ని పటుతరంగా అందించాడు. అరోరా బోరియాలిస్? విస్లక్ వర్ణ చిత్రాలకు నేను ప్రాముఖ్యమిస్తాను. టర్నల్ వర్ణచిత్రాల తర్వాత ఇంగ్లాండులో సూర్యాస్తమయాలు మరింత సౌందర్యవంతమయ్యాయని జాన్ రస్కిన్ చెప్పింది గొప్ప సత్యం.

చుక్కలు మరింత పెద్దవీ కాంతిగలవీ దగ్గరవీ అయివుంటే నేను మన ఆకాశాన్ని మరెంతో యిష్టపడేవాణ్ణి. వాటి లోతుపాతుల గురించి జ్యోతిశ్శాస్త్రవేత్తలు మనకు సవివరంగా చెప్పసాగాకనే అవి మరింత సౌందర్యాన్ని సంతరించుకున్నాయి.

బుజ్జి బుజ్జి హేమ్లెట్ల, ఒథెల్లోల ప్రపంచం, రోమియోల గోరియోల ప్రపంచం, కారమజోవ్‌ల ప్రపంచం, డోంబే, డేవిడ్ కాపర్ ఫీల్డు, మదాం బోవరీ, యేనాన్ లెస్కాట్, అన్నా కెరనీనాల ప్రపంచం, చిన్ని డాన్ క్విక్జోట్ల, డాన్ జవాన్ల ప్రపంచం, నేను జీవించే ప్రపంచం.

అంతగా ప్రాముఖ్యంలోని యిలాంటి జీవులనుంచి, మనలాంటి వారినుంచి, కవులు వైభవోపేతమైన ప్రతిమలను సృష్టించి వాటికి అమరత్వం ప్రసాదించారు.

శాస్త్రజ్ఞులూ సాహిత్యజీవులూ మనిషిగురించి రాసిన పుస్తకాలు చదవకపోతే అతణ్ని బోధపరుచుకోవడం అసాధ్యమైన ప్రపంచంలో మనంజీవిస్తున్నాం. ఫ్లాబర్ట్ రచన 'ఒకసరళ హృదయం' నాకు గాస్పెల్‌కంటె విలువైనది_ క్నుట్ హేమ్సన్ 'నేల పెరుగుదల'ను చూసి 'ఒడిస్సీ' చదివినప్పుడు ఎంత ఆశ్చర్యం పొందానో అంత ఆశ్చర్యం పొందాను. రోమారోలా నవల 'జాం క్రిస్టోఫ్'ను నామనవళ్ళు చదువుతారని ఆరచయిత హృదయానికీ మనస్సుకీగల గొప్పదనాన్నీ మానవజాతిపట్ల ఆయనకుగల అక్షయమైన ప్రేమనీ గుర్తించి పూజ్యభావం చూపుతారని నాకునిశ్చయం.

## 'చాచా నెహ్రూ' ప్రేమించి (?) పెంచిన (!) పిల్లలు

భారతదేశంలో 15 సం॥ లోపు ఉన్న వారిసంఖ్య 280 మిలియన్‌లు. ఈ సంఖ్య ఆఫ్రికా ఖండం మొత్తం జనాభా కంటె ఎక్కువ. ప్రపంచంలో రెండవ అత్యధిక పిల్లలు గల దేశం మనదే.

1974 లో పార్లమెంటు "Children are the nation's supremely important asset" (పిల్లలు జాతి సంపదలు) అని ప్రకటించింది- ఐతే ఈ మహత్తర నిధులు ఎలా ఉన్నాయి? నిరక్షరాస్యులై, నిరాహారులై, వివస్త్రులై అనాధల్లా అల్లాడే పిల్లలు- తిండిలేక పుట్టగనే చచ్చిపోయేవారు, తనకోసం, తన వాండ్లకోసం చిన్నతనం నుంచే బలవంతంగా కూలీపని చేసేవాళ్ళు, చోరీలు చేసేవాళ్ళు- మనసున్న ప్రతీ కన్ను చూడొచ్చు. వీళ్ళు దేశానికి కాబోయే పౌరులు- ప్రపంచ దేశాల్తోబాటు అభివృద్ధి సాధిస్తున్నామని డంబాలు కొట్టే ప్రభుత్వానికి వీళ్ళు కనిపించరు.

తెల్లకాలర్ ఉద్యోగులు, కార్మిక సంఘాలు తమ కోర్కెలు నెరవేరేందుకు సమ్మెలుచేసి సాధించుకోగలరు- కాని మంచిమాటలు వినలేని, సంఘాలు స్థాపించుకోలేని పసివాళ్ళ మూగబాధను మంచిమాటకు వినని, మనసుతో గ్రహించలేని ప్రభుత్వం ఓటు హక్కులేని వీళ్ళ బాధనేం అర్థం చేసుకుంటుంది? కొన్ని రాజకీయ పక్షాలు, సంస్థలు వారినిగూర్చి చేసిన విజ్ఞాపనలు విని ప్రభుత్వం మొసలి గుండెతో అర్థంపర్థం లేని ప్రణాళికలూ, పట్టాలు చూపి తృప్తిపడుతుంది.

---

ఇలాంటిప్రేమ నేటికాలంలో ఫేషను తప్పిపోతుందని నాకుబాగా తెలుసుగాని, పోతేనేం? క్షీణించకుండా అది జీవిస్తూ పోతుంది. దానిసుఖ దుఃఖాలను మనం అనుభవించుకుంటూపోతాం.

ఈప్రేమ దృఢతరం అవుతూందని, మరింత ప్రయత్నపూర్వకం అవుతూందని నేననుకుంటున్నానుకూడాను. దీని వ్యక్తీకరణల విషయంలో కాసింత నిగ్రహం, ఫలితాలమీద చూపువుంచేలా చేస్తుంది గాని, జీవితపోరాటం ఇంతగా బాధాభరితమైన మన కాలంలో ఈమనోభావానికి గల అహేతుకత్వాన్ని అదిఏమాత్రం తగ్గించదు.

మనిషి గురించితప్ప తక్కిన దేన్నిగురించీ తెలుసుకోవాలని నాకుకోరికలేదు. మనిషిని సమీపించడానికి పుస్తకాలు స్నేహపూర్వకంగా మార్గం చూపుతాయి. ప్రపంచంలో అందచందాలుగల, ఘనమైన ప్రతిదాన్నీ సృష్టించికూడా హెచ్చులు చూపని దీనులపట్ల గౌరవభావం నాలో రోజురోజుకీ పెరుగుతుంది.

('విదేశ సాహిత్యాల స్థూల చరిత్ర' - రచన: 1925 - అనే
ఫ్రెంచి గ్రంథానికి గోర్కీ ఉపోద్ఘాతం - అనువాదం: కె.వి.ఆర్.)

కాగితాల్లో మాత్రం బాలల దినోత్సవాలు, పార్లమెంటు ప్రకటనలు, బాలల సంరక్షణ కేంద్రాలు, ఆరోగ్య కేంద్రాలని, సంచార బాలుర వసతి కేంద్రాలని, బాల నేరస్థులకు శరణాలయాలని– బాలల అకాడెమీలని కార్యక్రమాలెన్నో నిర్వహిస్తున్నట్లు కాగితాలుంటాయి– కాని అవన్నీ నిరుపయోగమైన వాగ్దానాలే. అవి ముసుగులోని భయంకర స్వరూపానికి అందమైన రంగుల పూత మాత్రమే.

ఐతే వాస్తవ మేమిటి?

దేశ జనాభాలో 42% పిల్లలే.

ప్రతీ వేయి కాన్పులకి 125 శైశవమరణాలు: 42% మరణాలు 5 ఏండ్లలోని వాళ్ళకు సంభవించాయి– వానికి చెప్పుకోదగిన కారణాలు విరేచనాల వ్యాధి, శ్వాసకోశ సంబంధమైన వ్యాధులు– పోషకపదార్థాల లోపం.

నేషనల్ ఇన్‌స్టిట్యూట్ అఫ్ న్యూట్రిషన్ (హైదరాబాదు) వారు జరిపిన సర్వే ఫలితాలవల్ల 1–5 సం॥ మధ్యగల 77 మిలియన్ల పిల్లలలో 37 మిలియనులు (అనగా 48%) పోషకాహారం లోపంవల్ల బాధపడుతున్నారు:

ఇదే సంస్థ దేశవ్యాప్త సర్వే జరిపి 7,000 పేద కుటుంబాలలో సగానికి పైగా 5 సం॥ లోని ముగ్గురి పిల్లల్ని, 35% 1 నుండి 3 పిల్లల్ని పోగొట్టుకొన్నారు. 15% మాత్రం తమ సంతానాన్ని కాపాడుకోగలిగారు. (వీళ్ళు ధనికులై ఉంటారు.)

భారత ఆరోగ్య పరిశోధక మండలి పెద్ద డా॥ సి. గోపాలన్ అంచనా ప్రకారం 1951 లో 4 సం॥ లోపలి పిల్లలు 35% చనిపోయారు– 1971 వరకు ఆ పరిస్థితిలో మార్పులేదు.

ఇతర దేశాలతో పోల్చి చూస్తే– అభివృద్ధి పొందుతున్న శ్రీలంక, సింగపూర్ వంటి చిన్న దేశాలకన్న ఎక్కువే శిశుమరణాలు మన దేశంలో సంభవించాయి.

ఢిల్లీలో జరిగిన అంతర్జాతీయ పిల్లల వైద్యుల సమావేశంలో ఆసంస్థ అధ్యక్షుడు ప్రొ॥ ఇసాన్ దోగ్రమాసీ ఒక ఆశ్చర్యకరమైన విషయం చెప్పాడు. "స్వీడన్‌దేశం కన్నా 72% ఎక్కువగా మన ఒక్క పంజాబు రాష్ట్రంలోనే పిల్లలు చనిపోయారు. వాళ్ళందరూ 1 నుండి 2 సం॥ వయసుగలవాళ్ళే" అని చెప్పాడు.

5 సం॥ లోపలి పిల్లలు చనిపోవడానికి కూడా కారణం పోషకపదార్థాల లోపమే నని అఖిలభారత గణాంకపట్టికలు చెబుతున్నాయి. ప్రత్యక్షంగానో, అప్రత్యక్షంగానో భారతదేశంలోని సగం శిశుమరణాలకు కారణం పోషకపదార్థాల లోపమే.

మాతృగర్భంలో 28 వ వారంనుండే ఈ మరణాలు సంభవిస్తాయని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. మాతృగర్భస్త పిండాలు చావడంకూడా పుట్టినబిడ్డల చావులకిందనే జమ కడతారు, ఐతే ఈచావులకి కారణం ఏమిటి? తల్లికిసరైన మందులులేక, డాక్టర్ల పర్యవేక్షణ నోచుకోలేక, కాన్పుకి కావలసిన ప్రాథమిక వసతుల లోపంవల్ల- అంతేగాక పుట్టినబిడ్డను రక్షించే సరైన వైద్యసదుపాయాలు అసలే లేక పోవడంవల్ల.

ఈ మాతృగర్భస్త శిశుమరణాలసంఖ్య భారతదేశంలో సుమారు 1000 కి 100 ఉంటుంది. తల్లి రక్తలేమితో తిండిసరిగ్గా లేకపోవడంవల్ల పుట్టినబిడ్డలు నాలుగు వారాలలోపునే మరణానికి గురౌతున్నారు. ఇవేకాకుండా అంటువ్యాధులు వల్లకూడా మరణాలసంఖ్య ఎక్కువే. ముఖ్యంగా బాలెంతరోగం అనబడే ధనుర్వాతంవల్ల పల్లె పిల్లలు ఎక్కువగా చనిపోతుంటారు. పాపపుట్టగనే బొడ్డుతాడును శుభ్రమైన కత్తితో కోయకపోవడం అనేచిన్న అశ్రద్ధ వల్లకూడా ఎన్నోచావులు.

బాల్య మరణాల తరువాతది వ్యాధి పీడన. అతిసారం, శ్వాసకోశ వ్యాధుల వల్లకూడా చావులుతప్పవు. ఇవికూడా పోషకపదార్థాల లోపంవల్లనే సంభవిస్తాయి. ఇవి పట్టణాల్లోకన్న పల్లెల్లో ఎక్కువ కావడంవల్ల- మగశిశువులకన్న ఆడశిశువుల్లో ఎక్కువ, దీనికికారణం సామాజిక సాంఘిక ఆర్థికపరిస్థితులే. సంఘంలో స్త్రీలపైగల చిన్నచూపువల్ల ఈచావులెక్కువ.

తల్లికి, బిడ్డకు, సరైన పోషకపదార్థాలుఉండి, సరైన వైద్యసౌకర్యాలుఉంటే ఈచావులను నివారించవచ్చు. కాని అలాంటివేవీ సామాన్యజనానికి, పేదలకు, అందుబాటులో లేవు. ముఖ్యంగావారి చాలీచాలని ఆదాయం, యిరుకైన మురికియిళ్ళు, సాధారణ ఆరోగ్యసూత్రాలు తెలియని అజ్ఞానం కారణాలు. ఇవేగాక- సంరక్షకుల అశ్రద్ధ ఎక్కువకాన్పులు నిరక్షరాస్యత,కూడా కారణాలు. ఒక్కడు సంపాదించే పేదకుటుంబాల్లో ఆదాయమంతా దాదాపు తిండికే ఖర్చుచేసినాకూడా వాళ్ళకడుపులు సరిగ్గానిండవు. ఒకపిల్లడు తినేతిండిని ముగ్గురు తినడంవల్ల ఆహారలోపం కలిగి వ్యాధులకు లోనౌతున్నారు- అని డా॥ శాంతిఘోష్ శిశుసంరక్షణ విషయమై రాసిన పుస్తకంలో అన్నాడు.

ఈ చావులన్నిటికి ప్రాథమిక కారణం సామాజిక, ఆర్థిక పరిస్థితులే, మేమేం చేయలేమని డాక్టర్లు ఒప్పుకొన్నారు.

ఎన్ని ఆరోగ్యకేంద్రాలు తెరిచినప్పటికి ఈచావుల్ని అరికట్టలేక పోతోంది ప్రభుత్వం. కారణం- ఈకేంద్రాలసంఖ్య చాలతక్కువ, వున్నకేంద్రాల్లో సేవాభావం శూన్యం.

బాలుల్లో అంధత్వ నివారణకోసం 1970లో 'ఎ' విటమిన్ సరఫరా పథకాన్ని ప్రభుత్వం పట్టింది. అందులో 13 మిలియన్ల పిల్లలకు యేడాదిలో రెండుసార్లు అందే బదులుగా 'ఎ' విటమిన్ ఆయేడు 4 మిలియన్ల మందికే అందింది. "ఎ" విటమిన్, సరఫరాచేసే కేంద్రాల్లోంచి, కొద్దిరోజుల్లోనే మాయమైంది. "'ఎ' విటమిన్ పథకం అమలుజరిగిన సంవత్సరమే 12,000 మందిపిల్లలు అంధత్వానికి గురైనారు." అని ప్రముఖ సంఘసేవకురాలు శ్రీమతి తారాఅలీబేగ్ అన్నారు.

ఈ పథకంలోనేగాక ఇతర శిశుసంక్షేమ పథకాల్లోకూడ లంచగొండితనం ప్రబలిపోయింది. ఉన్నతోద్యోగుల అవినీతివల్ల, పాలనాధికారుల అసమర్థతవల్ల, ఎందరో బాలలజీవితాలు బలైపోతున్నాయి.

అవకతవక సమాజంలో- ఆర్థిక స్థితిగతులు సరిగాలేని తల్లిదండ్రులకు పుట్టిన బిడ్డలు అనారోగ్యంతో బాధపడుతూ, పాఠశాలలకు వెళ్ళలేక నిరక్షరాస్యులౌతున్నారు. 1 నుండి 4వ తరగతి చదివేవారిసంఖ్య ఎంతో పెరిగి పోయిందని ప్రభుత్వం ప్రకటనలు చేస్తుంది. కాని గ్రామీణప్రాంతాల్లో చాలామంది ఆ వయస్సుకే పాఠశాలల్ని విడిచి, పొలాల్లోకి, పశువులతో మైదానాల్లోకి, పోతారు. ఆర్థికపరిస్థితులదృష్ట్యా చదువు విడిచి పెట్టడం తప్పనిసరౌతుంది. ఏదేమైనప్పటికి ప్రాథమిక చదువు చదవడానికి పరిస్థితులు పుస్తకాలు ఏవీ సామాన్యజనానికి అందుబాటులో లేనివిధంగా ఉన్నాయంటే అతిశయోక్తి కాదు.

ఇటువంటి పరిస్థితుల్లో పిల్లలు తప్పనిసరై కూలీ పనిలో చేరాల్సి వస్తుంది. 1951 లోని లెక్కలను బట్టి 14 సంవత్సరాలలోపు వయసుగల పిల్లలు చాలా మంది కూలీలుగా ఉన్నారని, ఇందులో కొంత మంది చదువుకున్న వాళ్ళని తెలుస్తుంది. డిగ్రీలు చదివిన వాళ్ళే కూలి పనులు చేస్తుంటే ప్రాథమిక విద్యలు చదవాలన్న ఆసక్తి ఎవరి కుంటుంది? పల్లె పల్లెకో పాఠశాల నిర్మిస్తున్నామని ప్రభుత్వం చెప్పుతుంటే లాభంలేదు. పల్లెల్లోని, పట్టణాల్లోని పేదలు అసలే చదువలేరు.

గత 31 సంవత్సరాల నుండి ప్రభుత్వం ఈ విషయం ఆలోచించ లేకపోతోంది. ఎంతసేపు పల్లెకో పాఠశాల, వాడకో బడి తెరిచి, పుస్తకాలు ముద్రిస్తే బాధ్యత తీరిపోతుందని భావించడమే దాని కర్తవ్యమైంది. పాఠశాలలు తెరిచేముందు ఒక విషయం ఆలోచించాలి. ప్రజల పరిస్థితి ఏమిటి? ఎందుకిలా పాఠశాలల్లోకి రాలేకపోతున్నారు? వచ్చిన వెంటనే మధ్యాంతరంగా ఎందుకు చదువు విడిచిపెట్టి పోతున్నారు?

చదువు విడిచిపెట్టి కూలిపని కొందరు చేస్తే, మరికొందరు అదీ దొరకక నేరస్తులౌతున్నారు. నేరస్తులు కావడానికి రెండు కారణాలున్నాయి. మొదటిది- తల్లిదండ్రుల అజాగ్రత్త, అశ్రద్ధ, ఇంట్లోని అశాంతి, హీనస్థితి, సరైన నివాసావకాశాలూ, తిండీ లేకపోవడం. రెండవది ప్రభుత్వం.

1964 లో 21 సం॥ లోపు వాళ్ళు 17,929 నేరాలు చేయగా 1967 వరకు 22,853 నేరాలు చేసారు. ఈ విధంగా నేరాల సంఖ్య పెరుగుతూనే ఉంది.

రేపు నేరం చేయబోయేవాళ్ళని ఇవ్వాళ సంస్కరించడం నేర్చుకోని ప్రభుత్వం తమ తెలివిమాలిన తనంవల్ల వాళ్ళు నేరాలు చేస్తే జైళ్ళు మాత్రం నిర్మిస్తుంది. బాల నేరస్తులకు ప్రత్యేకమైన వసతులు జైళ్ళలో కల్పిస్తామని ఔదార్యం ప్రకటనలు చేయడమే గాని వాళ్ళు అలా కావడానికి గల కారణాలు తెలుసుకో నిరాకరిస్తుంది. చిన్నతనంలో వాళ్ళను బాధించే సమస్యలను గమనించి నివారించక, ఆ సమస్యలే వయసుతో పాటు పెరిగి పెద్దవవుతే- అప్పుడీ ప్రభుత్వం పిల్లలను జైళ్ళలోకి తోస్తుంది. కాకపోతే కాల్చి చంపుతుందే గాని ఈ నేర ప్రవృత్తికి గల కారణాలు మాత్రం విచారించదు.

పిల్లల భౌతిక జీవితావసరాలు (తిండి, ఇల్లు, బట్ట), మానసికావసరాలు (ప్రేమ, పోషణ) మరియు సామాజికావసరాలు (సమాజగౌరవం, ఆత్మగౌరవం, స్నేహాలు, ఆనందం) తీరిన్నాడు వారుమంచి పౌరులుగా మనగలరు- తీరనినాడు నేరస్తులు అవుతారు.

భారతదేశం ఇంతవరకు బాలల శ్రేయస్సు పేరుమీద ఏంచేసింది? బ్రిటిష్‌వారి హయాంలో 1850లో అప్రెంటిస్ చట్టం 1876లో సంస్కరణ పాఠశాలా చట్టం చేసింది. స్వాతంత్ర్యం అనబడేది వచ్చాక కేంద్రప్రభుత్వం 1960 లో పిల్లలచట్టాన్ని ప్రవేశ పెట్టింది- బాలనేరస్తులకోసం మామూలు జైళ్ళకిబదులు ప్రత్యేకమైన బాలలజైళ్ళు నిర్మించింది- బాలలసేవా సదనాలు నిర్మించింది- అయితే యిదంతా కాగితం అభివృద్ధే నిజంతరచి ఈసంస్కరణల అమలులోకి వెళ్ళిచూస్తే దానివికృత స్వరూపం కనిపిస్తుంది.

పిల్లలకోర్టులు చూద్దాం- డబ్బుండి అవారాగా తిరిగేపిల్లలకు, దిక్కులేని పేద పిల్లలకు భేదంతెలియదు ఈకోర్టులకు- దేశదిమ్మరులు అయినపిల్లలు తప్పనిసరిగా అపరాధులు కానవసరంలేదు. ఇంటిపరిస్థితులు సరిగాలేక తల్లిదండ్రుల అలక్ష్య వైఖరివల్ల పిల్లలు. ఇంటినుండి పారిపోవలసిరావచ్చు బాలలకోర్టుల్లో నాలుగింట మూడొంతులు ఇలాంటి పిల్లలకే శిక్షలు పడుతుంటాయి- ఈరెండు రకాలవాళ్ళను తీసుకుపోయి సంస్కరణ పాఠశాలల్లోనో, జైళ్ళలోనో వేస్తుంటారు. వీళ్ళలోఎక్కువ నష్టపోయేది అనాధబాలలే.

దేశదిమ్మరో, దిక్కులేనివాడో, నేరస్థుడో నిర్ణయించేది ఈదేశంలో పోలీసులే- వారి తొందరపాటు, దౌర్జన్యం, మూర్ఖత్వంవల్ల- విచిత్రంగా కనిపించిన ప్రతివాడూ నేర

స్తుడే- అలాంటివారికన్న అమాయక బాలలను నేరస్తులుగా భావించడంలో మాత్రం విచిత్రం ఏముంది? పిల్లలు నేరాలుచేసినట్లు, కోర్టుల కెక్కించినట్లు, శిక్ష అనుభవిస్తు న్నట్లు లెక్కలకులోపం ఉండదు.

భారతదేశంలో సంస్కరణ పాఠశాలల్లోకంటె జైళ్ళలోమగ్గుతున్న పిల్లలే ఎక్కువ. జైళ్ళలో పిల్లల ప్రత్యేక వార్డులుంటాయి- ఇందులో పరిస్థితి దారుణం- వీళ్ళపై మాన సిక దైహిక అత్యాచారాలెన్నో జరుగుతాయి- మామూలు జైళ్ళలోని పరిస్థితి (మాలపల్లి నుండి పేరీఉలర్ వరకు) మనకుతెల్సిందే- దొంగతనం చేయాలన్నబుద్ధి- చేయకతప్ప దనేవిశ్వాసం జైళ్ళు కలిగిస్తాయి- శిక్షణఇచ్చే సంస్థల్లోంచి వెళ్ళినట్లు ఈవిధంగా జైళ్ళ నుండి బాలలు బాహ్యప్రపంచంలోకి అడుగుపెడ్తారు.

నేరస్థులుగా పరిగణించబడని- నికృష్టబాలురు ఈదేశంలో చాలామంది ఉన్నారు. వాళ్ళు ఏంచేస్తున్నారని ఆలోచిస్తే కూలీలుగా బతుకుతున్నారని చెప్పవచ్చును- 14 సంవత్సరాల లోనివారు ఉద్యోగం చేయరాదని చట్టంఉన్నప్పటికి 280 మిలియన్ల పిల్లల్లో 10 73 మిలియన్‌లు కూలీలే- అందులో 7.88 మిలియన్‌లు బాలురు, 2.85 మిలియన్‌లు బాలికలు- 6,07,500 బాలురు, 1,67,800 బాలికలు పట్టణాల్లో పనిచేస్తు న్నారు- 6.04 శాతం బాలురు, 9.60 శాతం బాలికలు గ్రామాల్లో పనిచేస్తున్నారు.

అదనపు ఆదాయం కోసం పిల్లల్ని పనులకు తల్లిదండ్రులే పంపుతారు- గ్రామాల్లో నాట్ల సమయంలో, కోతల సమయంలో, పిల్లలను పనులకు పంపడం ఉన్నదే. పిల్లలు పశువులను కాయడం పల్లెల్లో నేటికీ చూడొచ్చు. ఈ విధంగా పెద్దకూలీలకు బదులు, తక్కువ కూలీ యిచ్చి ఎక్కువ పని తీసుకుంటారు పిల్లలతో. పరిశ్రమల్లో కానీయండి, ఇళ్ళలో కానీయండి పిల్లలతో బండచాకిరి చేయించుకుం టారు- ధనవంతుల ఇళ్ళల్లో వారి సుఖ భోగాలకు వీళ్ళు సమిధలు. పల్లెల్లో పసి తనం నుండే వీళ్ళు వెట్టి చాకిరీ చేయడం మొదలవుతుంది.

ఇవన్నీ ఇలా ఉండగా- పిల్లల విషయంలో చదువు, పోషణ ఈ రెండూ ఇంటా, బయటా సరిగాలేవు. చిన్నతనంనుండే వాస్తవికదృష్టి లోంచికాక "ఊహాజగ త్తులో విహరింపజేసే పెంపకం జరుగుతుంది.

చిన్నతనంలో పాడేపాటలు, చెప్పేకథల దగ్గరనుండి సమస్తమూ పిల్లల్లో ఏదో అతీతశక్తులున్నాయనే విశ్వాసాన్ని కలిగిస్తున్నాయి- దాంతో వాళ్ళు ఆత్మవిశ్వాస రహి తులుగా మారిపోతున్నారు- రెక్కలగుర్రం, అడిగిందల్లా ఇచ్చేచిప్ప, అందర్నీ చంపే కత్తి, ఏడుగురుభార్యల రాజకుమారులు- ఇవన్నీ శ్రమశక్తినుండి దూరంగా ఆలో చింపజేస్తూ- అతీతశక్తులపైని నమ్మకాల్ని కలిగించి పగటికలల్లోకి, నిస్తేజతలోకి దారి తీస్తాయి.

ఈస్థితిలోంచి యువత సామాజిక స్పృహలోకి సగంమేల్కొంది. వాళ్ళలోని చైతన్యానికి సరైన పునాదిలేదు- ఏవిధంగా మేలుచేకూర్చని సాంప్రదాయాల్ని కాలరాచి జయించామనే భావనలో ఉన్నారు. కాలేజీల్లో, యూనివర్సిటీ జీవితంలో 'భావాలు' వల్లెవేసిన యువత 'జీవితం' లోకి అడుగు బెట్టగానే తాము వ్యతిరేకించిన సంప్రదాయపు ఉచ్చుల్లో బిగుసుకు పోతున్నారు.

ఇలా ఎందుకు జరుగుతున్నది?

యుక్తవయసులో తీసుకున్న నిర్ణయాలకు వ్యతిరేకంగా ఎంతో మంది జీవితం గడుపుతున్నారు. కారణం- వాళ్ళ సంప్రదాయ పునాది కల్గిఉండటమే. దానిమీద వయసు తెచ్చిన ఉత్సాహం గోడలు ఎక్కువ కాలం నిలబడలేక పోతున్నాయి. అందుకే చిన్నతనం నుండే వాళ్ళ పెంపకంలో మార్పు రావాలి. చిన్న వయసులోనే జీవిత, సామాజిక వాస్తవాలను వాళ్ళు తెలుసుకునేలా చేయాలి. వాళ్ళ ఆలోచనల్ని సమాజం, సామాజిక సూత్రాల పరిధిలోనే ఉండేట్టు చేయాలి. వ్యవస్థను గూర్చిన ప్రాథమిక పాఠాలు చిన్ననాడే చెప్పాలి. హేతువాద దృష్టిని కలిగించడానికి అదే సరైన సమయం. ఇవన్నీ సాధించాలంటే వాళ్ళ పోషణలో, సాహిత్యంలో, కళల్లో మార్పు తీసుకురావాలి- మార్పు మార్పులా కాకుండా సహజంగా ఉండాలి.

పిల్లల పత్రికల తీరుతెన్నులు చూస్తే ఎంతసేపూ రాజుల బూజుల కథలు, పరోపకారి పాపన్న కథలు, చమత్కారాల చమక్కుల కథలే!

ఇకపోతే వారికి నిర్ణయించబడిన పాఠ్యాంశాలు కూడా మతాన్ని భక్తిని బోధించేవిగానే ఉంటున్నాయి- ఇక పాఠశాలల సంగతికివస్తే మరీ దారుణం. ధనవంతులకు ప్రైవేటు, రెసిడెయన్షిల్ స్కూళ్ళు, బీదలకు మాత్రం సౌకర్యాలు సరిగాలేని ప్రభుత్వ పాఠశాలలు. అవి పాఠశాలలు కావు- జైళ్ళు. సోషలిస్టు దేశంగా పోజుపెట్టే భారత దేశంలో వర్గపాఠశాలలుండడం హాస్యాస్పదం. ధనవంతుల పిల్లలకు చక్కని యూనిఫారాలు, వెళ్ళడానికి బస్సులు తదితర బూర్జువా వసతులు. వాళ్ళు, వారి ఆటలు, అలవాట్లు అన్నీ భూస్వామ్య వ్యవస్థకు ప్రతిబింబాలు. వాళ్ళు దేశాన్ని పాలించే ఒక వర్గంగా పెరుగుతుంటారు. వీళ్ళే రేపు బీదల గూర్చి ఉపన్యాసాలు యిస్తూ, తలాతోకాలేని ప్రణాళికలు వేస్తారు.

పిల్లలపై చిన్నతనంలోనే బలమైన ప్రభావం చూపేవి సినిమాలు- రేడియో, బూతు సాహిత్యం, సినిమాలు మేధో వికాసానికి పనికిరాకుండా, రంగు రంగుల కలల అగాధాల్లో మనల పడేసి, నిజజీవితాన్ని భయంకరంగా, దుర్భరంగా భావించేలా చేస్తున్నాయి- సినిమాసెక్సు కూడా బాలురు చెడిపోవడానికి ముఖ్యకారణం.

రేడియోలు ప్రచారం చేసే విష్ప్రయోజన కరమైన కార్యక్రమాలవల్ల ఎలాంటి విజ్ఞానం కలుగదు- సమాజం జీవితం ఈ రెండు సత్యాల్ని తప్పించి మిగతా వాటి గురించిన కార్యక్రమాలు ఉంటాయి.

ఈ మధ్యకాలంలో సాహిత్యంలో చాలా ప్రక్రియలువచ్చి జనంలో చైతన్యం తేవడానికి ప్రయత్నించాయి- 'అభ్యుదయ' కవులు, విప్లవ కవులు ఎంతసేపూ 'యువత'కే ప్రాధాన్యత ఇస్తారుతప్ప 'రేపటి యువత'ని ఇవ్వాళ మార్చడానికి ప్రయత్నాలు చేయకపోవడం శోచనీయం. పల్లెల్లోకి యువతరానికి సులభ కవితనీ, ఇంకా తొందరగా పేలే డైనమైట్ కవితల్నీ, పల్లెవాసుల కోసం పాటల్ని సృష్టిస్తున్న కవులు పిల్లల్ని మరిచిపోయారు. వాళ్ళనింకా 'రేడియో అన్నయ్య'లు, రాజుల కథలు, నల్లమందు గేయాలే నిద్రపుచ్చుతున్నాయి- ప్రజా కవులు నిద్రలోంచి లేస్తేనేగాని వీళ్ళ కళ్ళు తెరువరు- ఇవ్వాళ్టి యువతని వెన్నుతట్టడం ఎంత ముఖ్యమో రేపటితరాన్ని తట్టి లేపడం అంత ముఖ్యం!

3-9 సంవత్సరాల మధ్యకాలంలోనే పిల్లలు తమ చుట్టూరావున్న వాతావరణాన్ని సమాజాన్ని, వ్యక్తుల్ని చదవనారంభిస్తారు- అదే దశలో వ్యక్తిత్వం, ఆత్మవిశ్వాసం మేధోవికాసం కలుగనారంభిస్తాయి- సరైన దారి చూపడానికి సరైన కాలం అదే. యిది ఎలా సాధ్యం? ప్రభుత్వం నియమించిన గ్రామసేవికలు, ఉపాధ్యాయులు ఈ పని చేయలేరు. 'బాల సదనాలు' కూడా. ప్రభుత్వం సంవత్సరానికోమారు పిల్లల శ్రేయస్సుకై కొత్త పథకాల్ని ప్రకటిస్తుంది- కొన్ని నిధులు మంజూరు చేస్తుంది- అవి వాళ్ళకు అందుతున్నాయా లేదా అని చూడదు. కాబట్టి బాలలను సంస్కరించడం ప్రజల్లో ఒక వుద్యమంగా రావాలి.

దేశంలో ప్రతి ముగ్గురిలో ఒకరు నిరక్షరాస్యులు, అంటే గత మూడు దశాబ్దాల నుండి- 14 ఏళ్ళ వరకు పిల్లలకు నిర్బంధ, ఉచిత విద్య ఇవ్వాలన్న ప్రభుత్వ పథకం పూర్తిగా విఫలమైందన్న విషయం గుర్తుంచుకోవాలి ప్రభుత్వం. ఎక్కడెక్కడ ఆచరించ లేక పోయామని వెనక్కి తిరిగి చూసుకోలేని ప్రభుత్వం పార్లమెంటు భవనంలో కూర్చుని కాగితాల మీద ప్రణాళికలేసి తృప్తిపడుతుంది.

11-14 సంవత్సరాల మధ్యనున్న పిల్లలు దేశంలో 37 మిలియన్‌లు ఉంటే అందులో 25 మిలియన్‌లు నిరక్షరాస్య కూలీలే,

వచ్చే సంవత్సరం ప్రపంచ వ్యాప్తంగా "అంతర్జాతీయ బాలల సంవత్సరం" జరుపుతున్నారు. 1978-79 సం॥ లలో 52 మిలియన్ల డాలర్లు భారత ప్రభుత్వ బాలల పథకాలపై ఐక్య రాజ్య సమితి బాలల సంస్థ ఖర్చు పెడుతున్నది. ఈ నిధులు ఎంత వరకు బాలలకు అందుతాయో? సభలూ, సమావేశాలూ ఏర్పాటు చేసి పత్రికల్లో ధూం ధాం చేస్తారు. పిల్లలకు ఏవో అక్కరకురాని పోటీలు పెట్టి కొంత డబ్బుతో

బహుమతులు పంచి మొత్తంగా నిధులను దుర్వినియోగం చేసి దొంగ లెక్కలు చూపుతారు.

"బీదవారికి పోషక పదార్థాల లోపం ఉండకూడదంటే తాత్కాలికపు ఆరోగ్య మరియు పోషక పదార్థాల పథకాల వల్ల ఇది నెరవేరదు. దేశంలో సంపూర్ణ సాంఘిక ఆర్థికాభివృద్ధి జరగాలి!" అని భారత ఆరోగ్య పరిశోధక మండలి పెద్ద డా॥ గోపాలన్ అన్నారు.

నేటి ఈ ఆర్థిక వ్యవస్థ పూర్తిగా ధనిక వర్గాల లాభాల కోసం, పేదలను అన్యాయం చేయడానికే పనికివస్తుంది. ఎక్కువ శాతం పిల్లలు బడుగు వర్గాల్లోనే ఉన్నారు. ఈ వ్యవస్థ వల్ల వారు సామాజికంగా, ఆర్థికంగా వెనక్కి, ఇంకా వెనక్కి నెట్టి వేయబడుతూనే ఉన్నారు. ధనికుల చేతుల్లో, అన్యాయం కోరల్లో, చిక్కి చితికిపోతున్నారు. వారి మానసిక, దైహిక వికాసాల్ని నొక్కి పట్టేస్తోంది ఈ వ్యవస్థ.

అలాంటి ఈ వ్యవస్థ మారనంత కాలం, బడుగు వర్గాలకు ఆర్థిక న్యాయం చేకూరనంత కాలం ఎన్ని ప్రణాళికలు వేసినా లాభంలేదు- మేధావులారా! ఇవాళ్టి పిల్లల్ని మీరు తీర్చి దిద్దండి. రేపు వాళ్ళే ఈ వ్యవస్థను చక్కబరుస్తారు.

— జయధీర్ తిరుమలరావు

---

వచ్చే సంచికలో....

గిరాయిపల్లి మృతవీరుడు సుధాకర్ కవిత "దేనికోసం...."
ఊకోము – వడ్డెపల్లి సుధాకర్ కవిత
కుంపటి – కథ- అందుగుల మొండయ్య
మానవ జీవితంలో మనస్సు పాత్ర – కొడవటిగంటి కుటుంబరావు

---

## విరసం సాహిత్య పాఠశాల

1979 జనవరి 13, 14, 15 సంక్రాంతి సెలవుల్లో వరంగల్‌లో విరసం సాహిత్య పాఠశాల నిర్వహిస్తున్నది- భారతదేశ చరిత్ర, సాహిత్యచరిత్ర, సాహిత్య దృక్పథం, నూతన ప్రజాస్వామిక విప్లవంలో సాహిత్యంపాత్ర, ప్రజలపాటలు, కథ, నవల- జీవితం మొదలైన అంశాలపై కె.వి. రమణారెడ్డి, త్రిపురనేని మధుసూదనరావు, చలసాని ప్రసాద్ కాళోపట్నం రామారావు, పి. సి. నరసింహారెడ్డి, శరత్, వంగపండు ప్రసాదరావులు 'పాఠాలు' చెప్తారు.

పాఠశాల నిర్వహణకు అవసర ఆర్థిక, హార్దిక సహాయం చేయవలసిందిగా ప్రజా సాహిత్యాభిమానులకు విజ్ఞప్తి చేస్తున్నాం.

విరసం, వరంగల్ యూనిట్.

Regd. No. with Registrar of News Papers 10953/67

# గోదావరి పొరలుతోంది

చెరబండరాజు

మంటలకూ మారుపేరు
పోరాటంరో పోరాటంరో
పూరూరా కూలోడు
మండినాడురో, జం-డెత్తినాడురో ॥
జగిత్యాల తాలూకా
జీతగాళ్ళ తెగువ జూసి
పోరాటం ఆపొద్దని
గోదావరి పొరలుతోంది ॥మంట॥

అమరజీవు లందించిన
జీవశక్తి నడిపించగ
తోడూ తా నున్నానని
వెనకంజే వెయ్యొద్దని
మంజీరా పోరుతోంది ॥మంట॥

బంజర్లను ఆక్రమించి
నాగళ్ళే నడిపినపుడు
ఉప్పుమడిగ భూసామికి
పప్పులేమి ఉడకలేదు ॥మంట॥

రాడికల్లు సంఘపోల్ల
రైతుకూలి సంఘపోల్ల
సోర సోర పోర గాళ్ళ
పేర్లు చెప్పి భూసామీ
వ్యానులోన పడదోస్తే
షకిళ్ళాన పోలీసులు
యెక్కిళ్ళే పెట్టుకున్రు
ఇటు పొద్దటు పొడిచెదాక
కదలకుండ ఆపేస్తే
తలప్రాణం తోకకొచ్చి
సీల్గిన్రూ పోలీసోళ్ళు ॥మంట॥

పాలేళ్ళూ పనిమనుషులు
బూజువంటి భూస్వాముల
వెలివేసీ నిలదీసీ
అన్నాళ్ళూ దిగమింగిన
పన్నులు జరిమానాలూ
దండుగలూ ధరావతులు
కక్కిస్తుంటే ఇప్పుడు
ప్రజల దాడి కాగలేక
పట్నంలో పడ్డరండి
ఎర్రజెండ మెరుపుచూసి
మర్రిచెన్న నగ్నంగా
భూస్వాముల కాపాడే
కంకణం కట్టిండట
నక్సలిజం రూపుమాపె
మందులేవొ ఇస్తడంట ॥మంట॥

ముద్దునూరు లొత్తునూరు
కన్నాపురం కోరుట్ల
చినమెట్పల్లి సిరిసిల్ల
కరీంనగరు ఆదిలాబాద్
మంటలంటుకున్నాయి
భూస్వామ్యం కుప్పకూలి
రైతుకూలి జయిస్తాడు
దొరల గడీ విరిగిపడీ
పేదలిళ్ళు లేస్తాయి ॥మంట॥

గోదావరి పొరలుతోంది
పోరాటం ఆపొద్దని
మంజీరా పోరుతోంది
వెనకంచే వెయ్యొద్దని ॥మంట॥